కాంగిటాల రామశేషగారి స్వం.

వివేకచంద్రికా గ్రంథమాల 2. (ద్వితీయ కుసుమము.)

# వేదమతము




పోలిశెట్టి ఆదినారాయణగుప్త
(గ్రంథమాల సంపాదకులు)



మొదటికూర్పు 1000

1924

సహాయము

రు 116-0-0

ప్రధాన పోషకులు:

శ్రీ మద్ది వెంకట లక్ష్మయ్యగుప్తగారు,

అధ్యక్షుడు,

శ్రీ కన్యకాపరమేశ్వరీ జాతీయ పాఠశాల,

గుంటూరు.

# ప్రధాన పోషకులు.

---

శ్రీతుంపూడి భగవన్తమ్గుప్తగారు, బి. ఎ., బి. యల్.
సెకండుక్లాస్ ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు, మదరాసు.

శ్రీనేరెళ్ల వేంకట సుబ్బారావు శ్రేష్ఠిగారు,
గుంటూరు.

శ్రీఊటుకూరి వేంకటసుబ్బారావు శ్రేష్ఠిగారు,
వేటపాలెము.

శ్రీమద్ది వేంకటలక్ష్మయ్య గుప్తగారు, గుంటూరు.

శ్రీఊటుకూరి రా॥ వేంకటేశ్వర శ్రేష్ఠిగారు, చీరాల.

శ్రీత్రిపురనేని రామస్వామి చౌదరిగారు, బారిష్టరు,
తెనాలి.

# రాజపోషకులు

---

శ్రీ మద్ది వేంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు, గుంటూరు.

శ్రీ పెమ్మసాని సీతారామయ్య చౌదరిగారు.

శ్రీ అడుసుమల్లి నాగయ్య చౌదరిగారు.

శ్రీ దర్శి చెంచయ్య శ్రేష్ఠిగారు, బి. యస్. సి.
భీమవరము

శ్రీ ఉప్పుటూరి వెంకటపున్నయ్య గుప్తగారు
షాహుకార్, గుంటూరు

శ్రీ రేకపల్లి భాస్కరరావుగుప్తగారు, సాహుకార్
గుంటూరు

శ్రీ దేశభక్త సి. వి. రంగం శ్రేష్ఠిగారు, నారాయణవరం,
చిత్తూరుజిల్లా

శ్రీ వేముల వెంకట్రామయ్య గుప్తగారు, వర్తకులు
జగ్గయ్యపేట

శ్రీ పేరూరి బ్రహ్మానందం గుప్తగారు, షాహుకార్
జగ్గయ్యపేట

శ్రీ ఉప్పుటూరు వీరరాఘవయ్యగుప్తగారు, వర్తకులు
గుంటూరు

శ్రీ నూనె రంగనాయకులు పానకాలు గుప్తగార్లు,
షాహుకార్లు, గుంటూరు

శ్రీ రామదేవు నరసింహారావుగారు, కంట్రాక్టరు,
రంగూన్.

IV

## పోషకులు



శ్రీ పెదప్రోలు సూర్యనారాయణరావుగారు, అఖిల భారత విశ్వకర్మోద్ధరణ సంఘచాన్సెలరు, గుంటూరు.

శ్రీ జమిలి నమ్మాళ్వారుగుప్తగారు, కార్యదర్శి, ఆర్యవైశ్య యువకుల సాహితీ సంఘము, గుంటూరు.

శ్రీ కంచర్ల రామయ్యచౌదరిగారు, బ్రాహ్మణకోడూరు.

శ్రీ చుండూరి వీరాస్వామి గుప్తగారు, చీరాల.

శ్రీ దాచేపల్లి రామబ్రహ్మం గుప్తగారు, గుంటూరు.

శ్రీ దూపుగుంట్ల వేంకటకృష్ణమూర్తి గుప్తగారు, వర్తకులు, గుంటూరు.



# సహాయులు

శ్రీ బ్రహ్మాండం వేంకటలక్ష్మీనారాయణరావుగారు
శ్రోత్రియందార్, బాపట్ల.
శ్రీ దాసరి జానకిరామయ్యగారు, చీరాల.
శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు, మద్రాసు.
శ్రీ మిట్టపల్లి ఆదినారాయణగుప్తగారు, గుంటూరు.
శ్రీ కారుమూరి రాజగోపాళంగారు, జగ్గయ్యపేట.
శ్రీ చుండూరి లక్ష్మీనారాయణరావుగారు, జగ్గయ్యపేట.
శ్రీ తుమ్మెపల్లి సూర్యనారాయణగారు, జగ్గయ్యపేట.
శ్రీ ఇటికాల రామశాస్త్రిగారు, గుంటూరు.
శ్రీ శ్రీఖాకోళం పట్టాభిరాములుగరు,
కార్యదర్శి, మిత్రాభివృద్ధి సంఘము, చీరాల.
శ్రీ చీమకుర్తి కుమారస్వామిగారు బి. ఎ.
శ్రీ గుంటుపల్లి వేంకటప్పయ్యగారు, కంతేరు.
శ్రీ మల్లెల నాగేశ్వరరావుగారు, గుంటూరు.
శ్రీ కొరళ్ల శ్రీరాములుగారు.
శ్రీ త్రిపురమల్లు సాంబయ్యగారు.
శ్రీ అన్నాప్రగడ హనుమంతరావుగారు.
శ్రీ పావులూరి సుబ్బారావుగారు.
శ్రీ శ్రీనిశంకరరావు సుబ్బారావుగారు,
మిత్ర అండు కంపెని, గుంటూరు.

# గ్రంథమాలోద్దేశ్యములు

౧. ఈశ్వర దృష్టిలోగల సర్వమానవ సమాధికారమును స్థాపించుట.

౨. సాంఘికాచారములు కేవలము వ్యవహారికములని మహాపురుషుల వాక్యాధారములవలన జూపుట.

౩. వ్యక్తివికాసము ననుసరించి సాంఘిక నియమములు మారవలయునని ప్రబోధించుట.

౪. మానవునియందలి యీశ్వరతత్వమును ప్రజ్వలింపజేయుట.

పైయుద్దేశ్యములను వెలిబుచ్చుగ్రంథములు రెండునెలల కొకటిచొప్పున సంవత్సరమున కారు వెలువడును.

"దయానంద" గ్రంథమాలా మూడవకుసుమము.

చందావివరము- వార్షికము.

| | | | |
|---|---|---|---|
| రాజపోషకులు | రు ౨౫-౦-౦ | చందాదారులు | రు ౩-౦- |
| పోషకులు | రు౧౨-౦-౦ | ప్రవేశరుసుము | రు ౧-౨ |
| సహాయకులు | రు ౬-౦-౦ | | |

పోలిసెట్టి ఆదినారాయణగుప్త,
సంపాద[illegible]

# విన్నపము.

ద్వితీయ కుసుమము "దయానంద సరస్వతి" వెలువడ వలసియుండెను. కాని కొన్ని కారణములచే తృతీయకుసుమముగ వెలువడనున్న "వేదమతము"నే ద్వితీయ కుసుమముగ అంద జేయుచున్నారము. "వేదమత" గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజులవారిని యెరుగని వారుం డరు. వీరు వైశ్యకులమందవతరించి వేదమతమును, వైశ్య సంఘమును యుద్ధరించిన మహాత్ములు. "దయానందసరస్వతి" తృతీయ కుసుమముగ వెలువడును.

సంపాదకుడు.



# ఉపన్యాసము.

సభాధ్యక్షా! సోదర సోదరీమణులారా!

ఉపన్యాస మిచ్చుటకు ముందు ప్రారంభమున క్షమాపణలతో కాలమును వృథాపరచను. నే నుడువబోవు విషయములను మీ రుదారభావముతో గ్రైకొందురనియు, తప్పులను క్షమింతురనియు నే నమ్ముచున్నాను. వాగ్ధోరణితో గాని పదగుంభనలతో గాని నేను మిమ్ముల సంతోష పరుప జాలను. కొన్ని స్థితిగతులను సారాంశములను మీ యోచనకై నే నుడివెదను. వేయేల మీ కాశాభంగము కలిగించిన వాడనని జెప్పుచున్నాను. ఎటులైన విద్వాంసుడును శ్లాఘనీయుడును అయిన కలెక్టరు దొరవా (మండల కరగ్రాహి) రధ్యక్షత వహించుటకై ఆమోదించుటచే ఉపన్యాసమునకు ధైర్యముతో పూనుకొనుచున్నాను. ప్రాగ్విషయములను వారు శ్రద్ధతో గమనించు వారును ఉదార స్వభావులును అయి యున్నారు. వేదములను ఇతర సంస్కృత గ్రంథములను భాషాంతరీకరించి ఆర్యులకెల్ల శ్లాఘాపాత్రులైనటువంటి మాక్సుముల్లరు దొర వారి సహపాఠియైనందున వారట్టివారని మనము తప్పక నమ్మవలసి యున్నది. మీరు వేదము యొక్క నామము పెక్కు పర్యాయములు వినియున్నారు. మీలో కొందర వ్వాని భాగములను చదివియున్నారు. వేదమనునది (విద్ - తెలిసికొనుట)

అను ధాతువునుండి బుట్టినది. వేదమనగా జ్ఞానము. హిందూ దేశమున దీనిని విదమనియు, వేదమనియు ఉపయోగింతురు. ఇంగ్లండు దేశములో (విజ్‌డమ్) అనియెదరు. ఈ రెండుపదములును ఒక ధాతువు నుండియే యుత్పత్తి అయినవి. కనుక నీ పదము మన పూర్వులైన పూర్వ పశ్చిమార్యులకు వారు విడిపోక మున్నె తెలసియున్నదని గ్రహింపవలసి యున్నది. విజ్‌డమ్ అనినను వేదమనినను జ్ఞానమనియే అర్థము. కనుక మన వేదములను వేదము అని పిలుచుట సార్థకమైనది.

2. వేదమునకు రెండర్థములు. సామాన్యార్థములో మానవుని యొక్క జీవయాత్ర విషయమై తెలుపు యే గ్రంథమైనను వేదమని బిలువవచ్చును. సాధారణముగా ఆర్యఋషివర్యులచే పరంపరాగతముగా నుపదేశింప బడిన మంత్రములనే మనము వేదమని బిలుచుచున్నాము.

3. సర్వమతసమత్వభావము గలవాడను. మీలో ననేకులాదర్శములుకూడా అట్టివేయని నేను నమ్ముచున్నాను. ప్రపంచమందెల్లడలను జ్ఞానము జ్ఞానమె? ఏగ్రంథమునైనను యేతెగనైనను మనము తప్పని యనజాలము. మన మెల్లరము సోదరుల మనియు దేవుడు మన కెల్లరకు తండ్రియనియు నిర్ధారణ చేయుటకై మనము పోరాడుచున్నాము. సత్యము జ్ఞానము ప్రపంచమందే భాగమున నున్నను మన మొప్పుకొనుచున్నాము. హిందూ వేదము, జొరస్ట్రియా వేదము, క్రైస్తవ వేదము, మహమ్మదీయ వేదము, మొదలైనవన్నియు వేదమే?

4. ఈశ్వరుడు ఋషుల రూపమున గాని మహాత్ముల రూపమున గాని సత్పురుషుల రూపముల వల్లగాని జ్ఞానమును మనకు బోధపరచిన పై విధములను ఉత్పత్తివరుసయు జెప్పియున్నాను. ఖురాను బైబిలు తరువాత వ్రాయబడినదని ఎల్లరకు తెలిసిన విషయమే? క్రైస్తవ వేదము హిందూ వేదము తరువాత వ్రాయబడినదని ఒప్పుకొనక పోవచ్చును. ఇతర ప్రమాణముల విడచి వేసినను ఆ వేదముల కియ్యబడిన నామములే హైందవ వేదము పురాతనమైనదని చెప్పుచున్నవి. హిందూవేదమునకు "శృతి" అను పేరివ్వబడినది. క్రైస్తవ వేదమునకు "స్క్రిప్చర్" అను పేరివ్వబడినది. వ్రాత పద్ధతి మానవుడు సృజింపబడిన కొన్ని వేల వత్సరములకు అనుసరింపబడ లేదని అందరొప్పుకొను విషయమేయని నా నమ్మకము. మీరంద రేకీభవించెదరని తలంచెదను. అనేక శతాబ్దముల వరకు ప్రపంచమున వ్రాతయననేమో తెలియదు. వ్రాత యే సంవత్సరములో ప్రారంభింపబడినదో మనమెల్లర మేకీభవింపక పోవచ్చును. కాని ఒకానొకప్పుడది ప్రారంభింప బడినది. అది మానవునితో సమకాలికమైనదికాదు."స్క్రిప్చర్"అనగా వ్రాతయనిగాని, వ్రాయబడినదనిగాని, అర్థము. కాన బైబిలు వ్రాత మొదలిడినతదుపరి వెలువరింపబడినదని తెలియుచున్నది. దీనికి బైబిలే సాక్ష్యమిచ్చుచున్నది. నిర్గమకాండలో 32వ అధ్యాయములో 15-16 వచనములను చదువుము.

5. మోషే శాసనములు గల రెండు పలకలను చేత పట్టుకొని కొండదిగివచ్చెను. ఆపలకలు ఇరుప్రక్కలను వ్రాయ బడినవి. అవి యీప్రక్కను ఆప్రక్కను వ్రాయబడియుండెను.

6. ఆ పలకలు దేవుడు చేసినవి. ఆపలకలమీద చెక్క బడినవ్రాత దేవుని చేవ్రాత.

7. "శృతి"అనగా వినబడినదని యర్థము. హిందూ వేదము ప్రపంచమునకు వ్రాత తెలియకపూర్వమె వెలువడి నట్లు తెలియుచున్నది. ప్రాగ్దేశమందలి పండితులెల్లరు వేదము లలో నే భాగమైన వ్రాయబడినట్లు కనుపడదని యొప్పుకొం దరు. వేదము వినబడినదే? విపుల భావమునందు వేదమనగా "శృతి"

8. ఋగ్యజు సామాథర్వణములేగాక యింకను కొంత గలదు. హిందూసోదరు లిందు కొప్పుకొనక పోవచ్చును. కాని మన పరాయతము (బ్రాహ్మణము) నుండి కొన్ని యాధార ములను జూపగలను. మూడవఖండమున (10-11-3)చూడుము. ఇంద్రునకును భరద్వాజునకుజరిగిన సంభాషణయందు ఇంద్రుడు "అవంతావై వేదాః"వేదముల కంతులేదు అని చెప్పియున్నాడు. ఇంతకంటె ప్రబలమైన యాధార మేమికావలయును. "త్రయీ వేదాః" అను పదమును మీ రెల్లరు వినియున్నారు. అందు వలన ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అని మీరు గ్రహించెదరు. అటులైనచో అధర్వణ మేమైనది. కొందరు పండితులు అధర్వణవేదము ఋగ్వేదమునుండి తీయబడుటచే

ప్రత్యేక నామ మీయలేదని చెప్పుచున్నారు. అధర్వణ వేద ములో కొన్ని భాగములు మాత్రమే ఋగ్వేదమునుండి గైకొన బడినవి. సామవేదములో 73 మంత్రములు తప్ప మిగిలిన దంతయు ఋగ్వేదములోనిదే యని నిరూపింపబడినది. కాని సామవేద మునకు ప్రత్యేక నామ మొసగబడినది. అందు వలన పండితులు జెప్పునది సత్యము కానేరదు.

9. సోదరులారా! మనము త్రయీ వేదాః అని చెప్పు మాటకు మూడు వేదములని యర్థముకానేరదు. మూడు విధములైన మంత్రములని (త్రయాత్మక) అర్థము వచ్చును. ప్రతి దేశమందును (గద్య, పద్య, గీత) వచన పద్య కీర్తనలను మూడువిధములు గలవు. పూర్వమున సంస్కృతమందు దీనిని ఋచః, సామాని, యజూంషి యని వాకొనిరి (తైత్తిరీయ బ్రాహ్మణం 1-2-1) చూడుము. "ఋచః" అనగా పద్య ములు. "సామాని" అనగా గీతములు. "యజూంషి." అనగా గద్య. జ్ఞానము, ఋక్, సామ, యజు, ర్మంత్రముల నెడి మూడు పర్వతసమములైన రూపములు. (త్రింగిరిరూపం) మూలమున యితరులకు తెలియజేయబడుచున్నది. (తైత్తి రీయ బ్రాహ్మణము 3-10-11-3) యీభాగము వేదము లనంతములైనవనియు గద్య పద్య గీతములనెడు మూడుభాగ ములు కలిగినవనియు ఇట్లు ప్రతివేదమునందును నిరూపింప వచ్చును. సాలమన్ వ్రాసిన కీర్తనలు యిందుకు తార్కా ణము. ఇంద్రుడు తాను మూడువేదములను మాత్రమే చదివి

విశిననియు సర్వవిద్య అనబడు వేరొకవిద్యను తాను చదువ లేదనియు భరద్వాజునితో జెప్పెను. ఇంద్రుడు భరద్వాజునితో "ఏహిఇమంవిద్ధి" అనగా (వచ్చి దీనిని నేర్చుకొనుము) అని చెప్పెను. స్వర్ణతుల్యమైన యీ యభిప్రాయనుబట్టి మనము నడవవలసియున్నది. కనుక మీరు యీసర్వవిద్య నభ్యసింప వలసినదని వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాను. ప్రస్తుతము దివ్యజ్ఞానసమాజము (థియాసాఫికల్ సొసైటి) వారును బ్రహ్మసమాజమువారును లిబరల్ క్రిష్ట్యనులును ప్రయత్నించుచున్న విధమున మనమును సర్వజనహితాలయము (Universal Church)లో చేరుటకును మనముకూడా ప్రయత్నింపవలయును.

1*. జ్ఞానము ప్రప్రథమమున నార్యావర్తమునగల మహర్షులకు విశదీకరింపబడెను. ఆర్యులలో నొకతెగ దేశమును విడచి పశ్చిమదిశవైపునకు వెడలిరని యనుమానరహితముగ విశదీకరింపబడినది. ప్రస్తుతమింగ్లీషువారియార్యులసంతతివారే. ఒకతెగ రష్యాదేశమునకు మరియొకతెగ హిందూదేశమునకు వెడలిరి. ఆర్యావర్తమందలి మహర్షు లుపదేశించినదియు పరిష్యాదేశమందు జొరాష్టర్ యుపదేశించినదియు, యూదియాదేశమందు మోషే క్రీస్తు లుపదేశించినదియు, అరేబియా దేశమందు, మహమ్మ దుపదేశించినదియు మనము గ్రహింప వలసినదే? ఈ మహాత్ము లుపదేశించినవియెల్ల వాటిపై నున్న దోషారోపణములను తీసివేసినయెడల ఒకవిషయ

మునుగురించియే మన కుపదేశించిరనియు వారియుపదేశము లందు భేదభావములేదనియు నాయభిప్రాయమై యున్నది. ఐరోపాదేశమందు ఒక మహాత్ముడైనా పుట్టియుండలేదు. ఆదేశమందు సంస్కర్తలును వివేచనాధురీణులును జన్మించి యుండిరి. కాని క్రీస్తు, జొరాష్టరు, మహమ్మదు మొదలైన మతస్థాపకులను బోలినవారు జన్మించియుండలేదు. మతస్థాపకు లెల్ల ఏష్యాదేశమం దుద్భవించినవారే? ఆసియాదేశమునం దన్నియు ఉపమానరీతిగా నుపదేశింపబడియుండెను. మన యీ మహాత్ముల యుపదేశముల గ్రహింపవలయునన్న నుప మానోపమేయముగాక వాని విశేషార్థమును గ్రహింపవల యును. విశేషార్థమునకును ఉపమానమునకును గల తారతమ్య మును మనము బాగుగా గ్రహించి యుండవలయును. అప్పుడే సర్వమతముల యుపదేశములను సమమని మనము గ్రహింప గలుగుదుము. మతములన్నియు యీశ్వరు డొకడున్నాడనియు, అతడే మనరక్షకుడనియు, మనుజులు మన సోదరులనియు స్వార్థమును వీడి మానవులసౌఖ్యమునకు మనము కష్టింప వలయుననియు చెప్పుచున్నవి.

11. జండ్ వెస్టగాని, బైబిలుగాని, ఖురానుగాని, దేవు డొక్కడేయని సూచించునను విషయము నిర్వివాదాంశము. హిందూవేదము దేవుడొక్కడని చెప్పునని నమ్మకపోవచ్చును. కాని నేను అది అట్లేబోధించునని వక్కాణించెదను. ఇక ముందు నేను వేదమని యుపయోగించినపుడెల్ల పారంపర్యము



గా మహర్షులచే యుపదేశింపబడిన మంత్రమను నర్థముతో నుపయోగించెదను. బ్రాహ్మణము మంత్రమని చెప్పజాలను. నాయభిప్రాయమునందిది వేదమునచేర్పబడుట తప్పు. మహాభారతము పంచమవేదమని యెట్లుచెప్పుచుండిరో బ్రాహ్మణమును నట్లే చేర్పబడియుండెను, మహర్షులేమిచెప్పిరో దానిని తెలిసికొనవలయునన్న మంత్రభాగమునుమాత్రమే మన మాధారముగా తీసికొనవలసి యున్నది. బ్రాహ్మణ భాగమును దీసివేయుటకు కారణములు చెప్పవలయునన్న కాలాతీతమగును. అథమ మొకదినమైనను దానికుపయోగింప వలసి వచ్చును. ప్రాక్పండితవరేణ్యులు (Oriental Scholars) ను పురాతనహిందూపండితులును బ్రాహ్మణమును తీసివేయవలసినదని నుడివినట్లు నేను నిరూపింపగలను. బ్రాహ్మణము మంత్రమునకు భాష్యమేగాని వేరుకాదు. మూలమును భాష్యమును గలిపి రెండును సమానమని వాదించు వీరికుతర్కములెల్ల అసత్యములని గోచరమగుచున్నది. ఈ రెంటిని కలుపుటవల్ల మహర్షులయొక్క యుపదేశములకు అపార్థములు కలిగించినది. ఈ యభిప్రాయమునందు కొందరేకీభవింపక పోవచ్చును. కాని యీదినమున మంత్రముయొక్క నిర్మలత్వమునుగురించియు ఆర్యమహర్షులు స్థాపించిన మతముయొక్క నిర్మలత్వమును గురించియు నుపన్యసించెదను.

12. వేదమనగా మంత్రభాగము. (ఛందోభాగము) దేవుడొక్కడేయని నిరూపించుచున్నదని నేను తిరిగి వక్కాణించుచున్నాను.



13. ప్రస్తుత మభ్యసింపబడు సంస్కృతమునకును వేద భాషయగు సంస్కృతమునకును మిగుల వ్యత్యాసముకలదు. సంస్కృతము గ్రీకు, హిబ్రూ భాషలకు సోదరభాషయని పిలువబడుచున్నది. కాని వేదభాషయగు సంస్కృతము పీటి కన్నిటికి మాతృభాషయై యున్నది. అది ఛందస్సు అని పిలువ బడుచున్నది. జండ్ ( zend ) అనునది ఛందస్సు అను పద మునుండి యుత్పత్తి యయియున్నది. వేదములయొక్క స్వచ్ఛ భావమును గ్రహింపవలయునన్న ఛందోభాషను మనము బాగుగా గ్రహింపవలసియున్నది. తాత్కాలిక సంస్కృత మునకనుసరించి యర్థముదీసికొనినయెడల గొప్పపొరబాటుపడిన వార మగుదుము. ఇదివరకు పొరబడినట్లే వేదార్థము గ్రహిం చుటయందు యికముందును పొరబడుదుము. "అసుర" అను పదమును గైకొని విచారింతము. ఏ సంస్కృతపండితు నడిగి నను రాక్షసుడని అర్థముచెప్పుదురు. మనమెల్లరము అట్లే యనుకొనుచున్నాము. ఛందస్సునందుగాని జండ్ నందుగాని దానియర్థమేమి? అది మిగుల యుత్కృష్టమైనది. సరస్వతి యింద్రుడు, అగ్ని, మొదలగువారందరు అసురులెట్లగుదురు. అసురపదముయొక్క యర్థము పూర్ణముగా మారిపోయినది. ప్రస్తుతము వేదములో నంత్యభాగమునందును రాక్షసుడను నర్థముతో నుపయోగింప బడినదిగాని పెక్కుభాగములందు దేవతలను నర్థముతో నుపయోగింప బడినది.

"త్వం రాజేంద్రయేచ దేవాం త్సాన్నౄౣ
పాహ్యసురత్వ మస్మాౣ" ఋగ్వేద 1-174-1
"బృహదుగాయిషే వచోఽసుర్యానదీనాం" ఋగ్వేద
7-96-1

14. ఇటువంటి నిదర్శనము లనేకములు జూపింప వచ్చునుగాని ఇప్పుడు కాలము వ్యర్థపుచ్చనెంచలేము. "సుర" అనునది అసుర అను పదమునుండి పుట్టినదిగాని అసుర, సురనుండి యుద్భవించినదిగాదు. వేదములో సుర అనునది ఎచ్చటనైనను దేవతలను అర్థముతో నుపయోగించినట్లు కానబడదు.

15. అదితియను మాటకు ప్రస్తుత పండితులెల్లరు కశ్యపప్రజాపతి భార్యయని యర్థమిచ్చుచున్నారు. కాని వేదార్థ మేమి? మనపూర్వులొక నూతన పదార్థము కనుగొనినట్లు దీనివలన మనకు తెలియుచున్నది. ఆపదముయొక్క భావ మెంత యుత్కృష్టమైనది? "అదితి" అనగా అనంతమని యర్థము. ఈసందర్భమున మాక్సుముల్లరు వ్రాసిన దానిని చదువవలసియుండును. (లెక్చర్సు ఆన్ది ఆరిజన్ అండ్ గ్రోతు ఆఫ్ రిలిజన్) (Lectures on the origin and growth of Religion) 233 పుట చూడుము.

16. అనంతమను పేరుగల (సంస్కృతమున అదితి) యొకదేవత వేదమందు గలదని స్ఫురించినపుడు నేనెంత యబ్బురమందితినో మీరట్లే ఆశ్చర్యమగ్న మానసులగుదురు

17. అదితి దితియను పదమునుండి యుత్పత్తి అయియున్నది. వ్యతిరేకప్రత్యయమైన ( Negative Participle ) అ, దితి, అనునది దా (ద్యాతి=కట్టుట) అను ధాతువునుండి యుత్పత్తి యయినది. దీనినుండి దిత (కట్టబడిన) అనబడు నసమాపకక్రియయును దితి, అనగా కట్టబడిన లేక కట్టబడుచున్న యను నామవాచకమును ఉత్పత్తియయినది. గనుక అదితి అను పదము ప్రారంభమున బంధింపబడనిది. అనగా, అనంతమైనది. అడ్డులేనిది. అంతులేనిది. అని యర్థమిచ్చియుండ వలయును.

18. ఇప్పటి సంస్కృతమునుబట్టి శోధించినయెడల వేదము అవగాహము కానిది బహు దేవతారాధన బోధించుచున్నది. అసందర్భమైనది సరిగా నర్థము చేసికొనునెడ అది యొక దేవతారాధన సూచించుచున్నది. దంభరహితమైనది. జ్ఞానదాయకమైనది. ప్రస్తుత మిప్పుడు అనేక వర్ణములును, శాఖలుగను ఏర్పరచినట్టి యాచార మసత్యమని బోధించుచున్నది. అందు స్త్రీపునర్వివాహమును ఆక్షేపించుట కెట్టి పునాదియు లేదు. బాల్యవివాహము లం దనుమతింపబడలేదు. సముద్రయానము నిషేధింపబడలేదు. సూక్ష్మముగా జెప్పినయెడల యిప్పటి పాశ్చాత్యనాగరికు లేమి చెప్పుచున్నారో యదియె చెప్పుచున్నది.

19. ఏకదేవతారాధనను గురించి మానవుడు భగవద్భక్తిని గ్రహించి యీశ్వరునిగాంచును. ఆయనకు పేరు బెట్టవలసియుండెను. పేరేమి బెట్టగలము. మాప్రాగ్పాశ్చాత్య జ్ఞానము



లతో నిరాక్షేపణమగు నామమూహింపగలరా? నేనుతగిన పేరు చెప్పలేనని గట్టిగా నమ్ముచున్నాను. వానిని పనిబట్టిగాని గుణమునుబట్టిగాని సగుణునిగాగాని పేర్కొనవలయును. వానిచే సృజింపబడుసగ్ని ప్రజ్వరిల్లుటచూచి వాని సగ్నియని పిలుతుము. ఋగ్వేదము "అగ్నిమీళే" అని ప్రారంభింపబడుచున్నది. నేను భగవంతునిస్తోత్రముచేయుచున్నాను. వానిలోమంచిని (Good) జూచుచున్నాము. మంచిగాంచి యాతనికాపేరు బెట్టదలచి (Good) గుడ్ అనుదానిని సంక్షేపించి (God) గాడ్ అని పిలుచుచున్నాము. హైందవయూదీయ వేదములలోని భగవంతుని నామములనేకములు పుట్టినరీతి యిదియే? ఇట్టి స్వప్రమాణ సిద్ధాంతమున (మనలో కొందరంగీకరింపకపోవచ్చును,) సహాయముగా నేను రాబ్సన్‌గారి హిందూయిజమ్ అండ్ యిట్సు రిలేషన్ టు క్రిస్త్యానిటి (Hinduism and its relation to Christianity) గ్రంథములోని కొన్నివచనములను యిచ్చట నిరూపించుచున్నాడను.

20. ఆర్యులు భగవంతునియొక్క యాశీస్సులను వానియొక్క మహాకార్యమునుబట్టి పేరిడుటచే యనుభవములోనికి దెచ్చుకొన ప్రయత్నించినట్లు కనబడుచున్నది. వేదమంత్రములు వివిధదేవతలకు సంబోధింపబడినవి. ఆ దేవతల పేర్లుసృష్టిపరిణామములకుగూడ యర్థమిచ్చుచున్నవి. లేక వాటినుండి అట్టియర్థము సాధింపవచ్చును. ఇటులుండగా భక్తుడు ప్రప్రథమమున సృష్టిలోనుండి సృష్టికర్తయగు దేవుని జూచినట్లును

వానిని వానికృత్యముల పేర్కొనుటచేవానినారాధింపయత్నించి నట్లును భాషనుబట్టి దృష్టాంతములు గనబడుచున్నవి.

21. పూర్వపు హెబ్రీమతబోధకులు బహిరంగ యీశ్వరారాధనలో జిహోవాయను నామము విసర్జించి దానికిబదులుగా సంభాషింప నలవిగానివాడనిగాని తదర్థ మొసగు మరియొక పదమునుగాని ఉపయోగించుట వారి యొక్క ఘనగుణాతిశయమును బట్టియే యైనది. ఏలనన మానవభాషలో ఆ యతీతునికి తగినపేరుబెట్ట సాధ్యపడదు. ఇంతవరకు మనము చేయదగినదేమన్న యొకగుణమేదో యెత్తుకొని యాదేవతకు యితరగుణముల నారోపించుటకు మన మీశ్వరునియెడ ప్రయోగించు నామములన్నియు నిట్టివే యని కనబడుచున్నవి. దృష్టాంతము, గాడ్ (God) జెహోవా యనగా నిత్యుడు, అనంతుడు, ప్రభువు, సర్వశక్తివంతుడు, అతీతుడు, యీ నామములన్నియు మనబుద్ధివికాసమువలన భగవంతునికి యుపయోగింపతగినవని మన వివేచనాశక్తి మనకు బోధించుచున్నది. ఏ యొకనామమైన వాని స్వభావముయొక్క కొంతభాగమునే వర్ణించుచున్నది గాని మనము సర్వమును దెలుపుచున్నదని యనుకొనుచున్నాము. మనము సగుణునికొరకు ప్రయోగించుటమూలముగా నెరవేర్చుకొన్న కార్యమును మనపూర్వీకులు సృష్టికర్తకు సృష్టిలోని కొంతగాని అంతయునుగాని ప్రయోగించుటచే అనగా క్రియచే కర్తను తెలుపుటవల్ల నెరవేర్చుకొనిరి.



22. అగ్నికి రెండర్థములున్నవని మీరు గమనింపవలయును. 1 సృష్టించబడిన యగ్ని 2 సృష్టించేయగ్ని. ఇది పందొమ్మిదవ శతాబ్దములో నొక్కరాబ్సన్‌గారి యభిప్రాయమేనా? కాదు. వేలసంవత్సరములకుపూర్వము జీవించియుండిన మిగుల గొప్పవానియొక్క ప్రమాణమునే నిరూపింపగలను. బాగుగ జ్ఞాపకముంచుకొనుడు. వానిపేరు "దీర్ఘతమసు" ఋగ్వేదమునాటి యొకఋషి. ఆయన "ఏకం సత్ విప్రాః బహుధావదంతి"

23. ఒక్కడేగలడు. జ్ఞానులు దానినసేకనామములతో పిలుచుచున్నారు. క్రైస్తవుల ప్రార్థన "స్వర్గములోనుండు నా తండ్రీ నీనామము పవిత్రమగుగాక"అని ప్రారంభింపబడుచున్నది. మనపూర్వులు వానినెట్లు సంబోధించిరి. ఈపైనచెప్పబడినవి మీ పుస్తకములలో నె 223 పేజీలో మాక్సుముల్లరు చెప్పియున్నాడు.

24. మాక్సుముల్లరు పైపుస్తకము 223 పేజీలో సాధు హృదయులగు మనపూర్వులు ఆజగత్పితనేమనిరి. అయిదువేల సంవత్సరముల క్రితము లేక నింకను పూర్వము మనయార్యులు సంస్కృతము, గ్రీకు, ల్యాటిను, భాషల నెరుగకమునుపే "జూపితర్"అనగా ఆకాశము తండ్రీ అని జెప్పుకొనుచుండిరి.

25. నాలుగువేల సంవత్సరములకు పూర్వము లేక నంతకుపైగా దక్షిణమున పంజాబు నదులవద్దకు చేరినప్పుడు వానిని "జయుష్పిత" అనగా ఆకాశము తండ్రీ యనుచుండిరి.

26. మూడు వేల సంవత్సరములు లేక అంతకుపూర్వ ము హెలస్పాంటు తీరవాసులగు ఆర్యులు "హెవెన్‌ఫాదర్" అనిరి.

27. రెండువేల సంవత్సరములు లేక అంతకుపూర్వము యిటలీదేశార్యులు ప్రకాశమగు ఆకాశము వంకజూచి దానిని "జుపిటల్" "హెవెన్‌ఫాదర్" ఆకాశము తండ్రియనిరి.

28. వేయివత్సరములకు పూర్వము యీ ఆకాశము తండ్రియే "హెవెన్‌ఫాదరు" జగత్పితరుడు జర్మనీదేశపు చీకటి యడవులలో మన విచిత్రపుపూర్వులగు ట్యూటానిక్ ఆర్య లీనామమునే జిన్, లేక జియో అని కడపటిసారి వాడినట్లు తోచుచున్నది.

29. ఎన్నాటు మేయోచనయును యెప్పుడు పూర్తిగా నాశనము కానేరదు. మిగుల పురాతనమైన రోముదేవాలయ ము పిమ్మట స్థాపింపబడిన మనపురాతనాశ్రమమునందు దృగ్గో చరముకానివానికి అనంతమైనట్టివానికి మన నలుదిశలును వ్యా పించియున్నవానికి మనము తెలిసికొనజాలనివానికి ప్రపంచ మందును మనయందును లీనమైయున్నవానికి నొక నామము బెట్టవలయునని మనము ప్రయత్నించిన నొక చీకటిగదిలో ప్రార్థనకై మోకరించి స్వర్గమందున్న యోతండ్రీ యనిపిలిచిన పేరుకన్న. వేరొండుసమాఖ్యతో మనము కనుగొనజాలము.

30. కాన నోసోదరసోదరీమణులారా! రెండువేల వత్సరములకు పూర్వము క్రీస్తుచే యుపదేశింపబడిన భావము

లన్నియు నాలుగువేల వత్సరములకు పూర్వము మనమహర్షులచే నుపదేశింపబడియుండెను. అకటా! ప్రస్తుతము మన హిందూదేశమున "ద్యాపితా" అను పేరుయొక్క యర్థము మరచిపోయిరిగదా? ఏవిద్వాంసుడైనను దానియర్థమడిగి చూడుడు. నేను రెండుదినముల క్రింద మనసంస్కృతపండితునడిగియుంటిని. "ద్యౌః" మనతండ్రియని పలికియుండిరి. తండ్రియను పదమువలన తల్లియనుపదము మనసుకు స్ఫురించుచున్నది. కాన భూమిని మనతల్లియనిరి. వీరిద్దరు వివాహముగావించిరి.

31. ఆర్యసోదరులు మానవజాతికి "ద్యాపితా" అనగా యేసుక్రీస్తు జెప్పినట్లు స్వర్గమందున్న మనతండ్రియనియు స్వర్గము మనతండ్రికాదనియు బోధింపవలసియున్నది.

32. యూదులును హిందువులవలెనే యీ పదమును యర్థమును సరిగా గ్రహింపకపోవుటవలన క్రీస్తు తద్విధముగా నుపదేశింపవలసివచ్చెను. స్వర్గమందుండెడి మనతండ్రిని పురుషుడనిపిలుతుమా? స్త్రీయనిబిలుతుమా? అతడు పురుషుడును గాడు. స్త్రీయునుగాడు. ఆతనికున్న మహాశక్తివలన మనము పురుషుడనిపిలుచుచున్నాము. మనఋషులు నట్లేబిలచిరి. మనయు జ్ఞానమాతని నెట్టిస్థితిలోనికి దెచ్చినదో చూచితిరా? అజ్ఞానులసహ్యమైన లింగరూపమున నాతని ప్రార్థించుచున్నారు. ఆతని తల్లియని బిలువుడు. పురుషుడనుటకుబదులు స్త్రీయని తలంచుడు. అతడు ప్రేమాస్వరూపుడును, దయామయుండును నగుటచే స్త్రీయని తలంచుడు. అట్లయినచో, శక్తి, కాళి, యనబ



డుభయంకరనామము లొసగబడి వేనవేలుజంతువులు బలి యివ్వబడుచున్నవి.

33. నేనిదివరకు నుడివినట్లే ఆతడు స్త్రీగాని పురుషుడుగాని కానేరడు. నపుంసకుడని తలంచెదము. అట్లయినచో నేమియగునో మనకెల్లరకు దెలిసినవిషయమే. నపుంసకమనగా నేమి? గుణరహితమైనదియు మంచిశబ్దములు లేనిదియు, ప్రేమ, దయ, మొదలగునవి లేనిదియునైయున్నది. బ్రహ్మమనగా నిర్గుణమని గ్రహించుచున్నాము. వానికి గుణములేదని జెప్పెదరు. అట్టిప్రార్థనవలన లాభములేదు. అతడు మనప్రార్థనల వినజాలడు. మనల రక్షింపజాలడు. అందువలన వాతని వధమును జేసితిమి. ఆతని దైవత్వముపోయినది. దయాస్వరూపుడైన మనతండ్రికానేరడు. మనరక్షకుడుకాడు. మానవునకు శరణ్యముగాని రక్షణముగాని లేనేలేదు. నపుంసకుడని తీసికొనుటవల్ల దేవుడు లేడనియే తేలుచున్నది. బౌద్ధమతము నింతకన్న వేరుచెప్పలేదు. మనకర్మలే మనల రక్షించునవి. యని తలంచుచున్నాము. నిస్సందేహముగా మనము సత్కార్యములు చేయవలసినదేగాని అవి మానవునెన్నడు రక్షింపజాలవు. మానవుడు పాపభూయిష్టుడు. తాను నిర్మలుడని చెప్పగల్గినవా రెవరైనను గలరా? హిమాలయములందున్నారని చెప్పబడు మహాత్ములైనను పరిపూర్ణులైన నిర్మలులుగారు. మనుజుడు స్వకర్మలచేత నెన్నడును రక్షింపబడడు. ఈ ప్రమాణమును దేవుడొక్కడే మనకు రక్షకుడనియును బైబి

లును వేదమును బోధించుచున్నవి. పవిత్రమైన భగవద్గీతయు పరమపవిత్రమైన గీతయు నీప్రమాణమునే బలపరచు చున్నది. శ్రీకృష్ణభగవానులు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ" అని చెప్పియున్నారు. అనగా నీవు కర్మలచేత రక్షింపబడుదువను భావమును వదలివేయుము. నే నొక్కడనే శరణ్యుడనని తెలిసికొనుము. నీపాపములనుండి నేను రక్షించెదను. విచారింపకుమని యర్థము. మనము మాన వులకు వేదఋషులైన, క్రీస్తు, మహమ్మదు, కృష్ణుడు, నందరి బోధ లొక్కటియేయని తెలియపరచవలసి యున్నది. మీలోకొందరు భిన్నాభిప్రాయులు గావచ్చును. అద్వైత మతస్థాపకులైన మహాగురు శంకరాచార్యులు "భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే, సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహిరక్షతి డుకృఞ్ కరణే" అని చెప్పియున్నాడు. అనగా వ్యాకరణము మొదలైన నీవిద్యలు మరణకాలమందు నిన్నురక్షింపలేవు. కాన నోమూఢుడా! దేవు నారాధింపుము, దేవు నారాధింపుము. అని యర్థము,

34. శ్రోతవ్యులారా! యీభావ మంగీకరించుటకు మీరేల సంకోచించెదరు. హిందువులారా! మీకు శంకరా చార్యునిగాని, రామానుజాచార్యునిగాని, మధ్వాచార్యుని గాని, వల్లభాచార్యునిగాని, నీలకంఠాచార్యునిగాని యేగురువు ననుసరించినను విఘ్నేశ్వరపూజయు, విష్వక్సేనపూజయు

నెల్లరాచరించుచునే యున్నారు. మీరచ్చట చదువు శ్లోకమేమో మీకు జ్ఞాపకమున్నదా? అది ముఖ్యముగా గమనింపవలసినది, కాలమున్నంతవరకు పదే పదే ధ్యానింపవలసినది. “పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవా, త్రాహిమాంకృపయాదేవ శరణాగతవత్సల అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణమ్మమ తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్షజనార్దన” నేను పాపిని. పాపకర్మల చేయువాడను. నా యాత్మపాపపరిపూర్ణమైనది. నేను పాపములో బుట్టితిని. ఓదేవా! దయగలిగి నన్నురక్షింపుము. నిన్ను శరణుజొచ్చువారి నెల్లరను నీవే రక్షించువాడవు. నాకువేరు శరణ్యములేదు. నీవుమాత్రమె నాకుశరణ్యము. కాన నోదయామయుడవైన ప్రభూ! రక్షింపుము. రక్షింపుము.

35. సోదర సోదరీమణులారా! బైబిలు వేదముల యొక్క బోధలోనిక్కమేయునుటకు మీకుసందేహము గలదా?

36. కీర్తనలలో దేవుడేమనకు శరణ్యమనియు, గాన భయపడ నవసరములేదనియు జెప్పియున్నాడు. దాని ననుసరింపుడు. మీరు రక్షింపబడెదరు.

37. దేవతా యనుపదమును గైకొనుడు. మనమిప్పుడు దానియర్థమేమని దలచుచున్నాము. ముప్పదిమూడుకోట్ల దేవతలని కొందరాక్షేపించుచున్నారు. ఔను, యున్నమాట సత్యము. అచ్చట దేవతయనగా నర్థమేమి? మనకు ముప్పదిమూడుకోట్ల దేవతలు లేరు. దైవమొక్కడేకాని ముప్పదిమూడుకోట్లుగాడు,

ఇంకెక్కువ దేవతలున్నారు. ఇంగ్లీషులో "గాడ్"అను పదము దేవతయను పదమునకు సరియైన భాషాంతరీకరణముగా దీని నేను నొక్కి వక్కాణింపుచున్నాను. దేవతయనునది దివ్ (ప్రకాశించుట) అనుధాతువునుండి యుత్పత్తియయినది. పాణిని "దివ్"అనగా క్రీడ. అనగా విజిగీష వ్యవహారజ్యోతి మోదమదస్వప్న కాంతిగతి యనిజెప్పియున్నాడు. కనుక "దివ్" అనుపదమునకు తొమ్మిదర్థములు గలవని మీకు దెలియుచున్నది. దేవతయనగా నీతొమ్మిదింటిలో నేదియైన యర్థముగా వచ్చును దైవమునకు (God) గూడా చెందవచ్చును మరి కొన్ని సందర్భములందు నీపదము ప్రయోగింపవచ్చును. కాన యేయే భాగములం దేయేయర్థములు వచ్చున ట్లుపయోగింపబడినదో తెలిసికొనుట ముఖ్యము. వేదములో వృక్షములును, మండూకములును, నానావస్తుసముదయములు వర్ణింపబడియున్నవి ఇవి దేవతలని పిలువబడుచున్నవి. కాని దైవములని పిలువబడుచుండుటలేదు. దేవతయనగా వర్ణింపబడిన విషయమని యర్థము. దేవతయన సాధారణముగా వస్తువని యర్థము(Object)ఇది నూతనాభిప్రాయముకాదు. కానిమరపునకు వచ్చినదైయున్నది. శౌనకుడు పాణినికి ముందటివాడు. ఏసుక్రీస్తునకు చాలపూర్వపువాడు. వేలసంవత్సరములకు పూర్వమున్న శౌనకుడు తన అనుక్రమణికయందు "యాతేనోచ్యతే సాదేవత" వర్ణింపబడిన దేవతయని పిలువబడుచున్నదని చెప్పియున్నాడు. అట్టి తరుణమందు మనకు ముప్పదిమూడుకోట్ల

దేవతలేగాక యింక నసంఖ్యాకములైన దేవతలు కలిగియుండ వచ్చును. ఒకప్పుడు శౌపర్ అను ఆంగ్లేయకవి శోషపీక పాన్పునుగూర్చి వర్ణించవలసివచ్చెను. అట్టి తరుణమందది యతని దేవతయని యనగా వర్ణింపబడువస్తువు. ప్రస్తుతము వేదమున దేవత. మీరు నాయంశములను ఖండించవచ్చును. అట్టి సమయమందేను మీదేవతను. అసలర్థము మరచిపోవుటవల్ల ప్రతిదేవతను పూజించుచున్నాము. కనుకనే హిందూదేశము హాస్యముల పాలైనది. అజ్ఞానమే తప్పిదమునకు మూలకారణము. నిన్నటిదినము లండన్ మిషన్‌స్కూలులో మన అధ్యక్షులు చెప్పినట్లు మనము మానవబృందముయొక్క అజ్ఞానము పోగొట్టుటకై విద్యగరపవలసియున్నది. మనమజ్ఞానముతో పోరవలసియున్నది. ఈయజ్ఞానమునే శంకరాచార్యులు అవిద్యయని పేర్కొని యున్నాడు. ప్రపంచమందలి పాపములకెల్ల నిదియే మూలకారణము. నిజమైనజ్ఞానము మనకు గలిగినపుడే మనము రక్షింపబడగల్గుదుము.

38. గతదివసము క్రైస్తవమిషనరీసోదరులు మనయొక్క యౌన్నత్యమునకు తామెల్లవిధముల సహాయము చేసెదమనియు మనకైయెట్టి కష్టములనైన భరించెదమనియు చెప్పినపుడు నాకు మహదానందమైనది. వారిదివరకు జేయుచున్నట్లె ప్రస్తుతము మన మనుసరించుచున్న పిచ్చియాచారముల నుం భావములను ఖండించి మన గ్రంథములయొక్క యథార్థమును సూచించి క్రైస్తవ వేదముయొక్కయు హిందూ వేదముయొ

క్కయు ఉపదేశము లోకవేయని బోధింపగోరుచున్నాను. నేజెప్పువిషయమునకు యజుర్వేదమునుండి కొన్ని యాధారములను జూపెదను.

39. ఋగ్వేదముభాషాంతరీకరింపబడియున్నది. అందరికందుబాటులోనున్నది. మనకెక్కువ వాడుకలోనున్న కృష్ణయజుర్వేదముభాషాంతరీకరింపబడియుండలేదు. దానియందువిశేషభాగము వచనమే అయియుండుటచే యజుర్వేదమని పిలువబడుచున్నది. మన మాతృభాషలయందుదానిని భాషాంతరీకరించి జనసామాన్యమున కుపయోగపడునట్లు జేయవలసియున్నది. ఈవేదప్రారంభమున "ఇషేత్వా"అనగా ఆహారముకొరకను చిన్న ప్రార్థనయున్నది. క్రైస్తవులిటులనే మన కేదినమాహార మాదిన మొసగుమని దేవుని ప్రార్థించుచున్నారు. ఇచ్చటఆహారమనగా శరీరమును ఆత్మనుకూడా తృప్తిపరచుచున్నది. అని అర్థము. "దేవోవసవి తఃప్రార్పయతు శ్రేష్ఠతమాయకర్మణే" సృష్టికర్త అయిన ప్రభువుమనలను ఘనకార్యములను జేయింపవచ్చును. క్రైస్తవులుమాచే దుష్కార్యములనుచేయించవద్దని ప్రార్థించి నట్లె "విశ్వమస్మత్ ప్రవహంతు విప్రం"అనియున్నది. మమ్ము పాపవిమోచనులను గావింపుమనియున్నది. "స్వస్త్యుత్తరాణ్యాసీయ" నాకార్యములెల్ల నాశీర్వదింపబడుగాక" ప్రజాంపాహి। ప్రజలను రక్షింపుము. నే నుడివిన విషయముల కీ యాధారములు చాలును.

40. ఋగ్వేదమునుండి యొకవాక్యము జెప్పెదను.

"కొనోమహ్యా అదితయె పునర్దాత్ పితరంచదృశేయం మాతరంచ" నేను నాతలితండ్రులను జూచుటకై అదితియనగా (అనంతుని) అదితియొద్దకు నన్ను తీసుకొని వెళ్లువారెవరు. ఈమంత్రము పునర్జన్మకు వ్యతిరేకముగా గానవచ్చుచున్నది. ఆవిషయమై ప్రస్థాపించబూనిన యొకదివసముబట్టుగానయిచ్చటవదలివేసెదను.

**41.** సంస్కృతభాషను పునరుద్ధారణ చేయవలయునని ఆతురత పడుచున్నప్పటికి అటులొనర్చుటలో మనము గొప్ప తప్పుత్రోవను బట్టుచున్నాము. ఈ వాక్యము హైందవసోదరుల కనేకులకు కష్టముగా నుండవచ్చునుగాని యిది ముమ్మాటికినిశ్చయమని చెప్పుటకు సాహసించుచున్నాడను. సంస్కృతభాష నభివృద్ధి జేయవలయునను నుద్దేశముతో దేశమెల్లడలను సంస్కృతపాఠశాలలను స్థాపించినందులకై దివ్యజ్ఞానసమాజమువారి కనేకవందనములు. ప్రస్తుతము మనమున్న పాఠశాలయును వారిమీదనే ఆధారపడియున్నది. కాని వారు విద్యావిధానమును సరిజూచుకొనినయెడల మేలుకన్న కీడెక్కువచేసిన వారగుదురు. పాశ్చాత్యవిద్య మన పిచ్చినమ్మకముల నణగద్రొక్కవలయునని ప్రయత్నించుచున్నది. కాని ప్రస్తుతము గగపబడుచున్న సంస్కృతము వానినియెక్కువ అభివృద్ధి చేయుచున్నది. మీరేమిగరపుచున్నారు. ఏమిగరపవలసియున్నది. ఏవియభ్యసింపవలసియున్నది. యీసమస్యల కంతునాకు తెలియకున్నది. అధ్యక్షులును విద్వత్సభికులును హిందూదేశ

ముయొక్క క్షేమమును కోరినవారుగాన లోపముల తెలుపుటకై నేను సాహసించుచున్నాను. కాళిదాసుయొక్క కావ్యములను చిన్నతరగతులందు మీరు బోధించుచున్నారు. అభ్యసింపుచున్నారు. పాశ్చాత్యులకు కాళిదాసుతో తుల్యుడగు షేక్స్పియరు రచియించిన గ్రంథములను యింగ్లీషుపాఠశాలలో ప్రారంభమున నేర్పినయెడల యెంతహాస్యాస్పదముగనుండును. కొందరు పురాణములను కొందరుస్మృతులును చదువవచ్చునుగాని అంతటితో నాగిపోదురు. స్మృతి నర్థసహితముగా చదివినవారు చాలఅరుదు. ఈగ్రంథము లుత్కృష్టములైనవి. ఐనను అచ్చటచ్చట వజ్రతుల్యములైన అంశములున్నను మనుజులకు అర్థాభిప్రాయములున్న పిచ్చియభిప్రాయములున్న బోధించుచున్నవి. ఇదియంతయు బ్రాహ్మణులు తమ ఆధిక్యతను గాపాడుటకై పన్నిన పన్నాగము. ఇవి దురభిప్రాయముతోను పిచ్చిఅభిపాయముతోను కూడికొనినపనులు. పురాణములన్నియు మానవబృందముయొక్క వ్యత్యస్తము చూపుటకును వేరువేరువిధములైన పూజావిధానములు తెలుపుటకును యేర్పడియున్నవి. మనము దయ్యములు భూతములుమంచిచెడ్డనక్షత్రములు మొదలగు నమ్మకములను వదలివేయవలయునని ప్రయత్నించుచుండగా నీపురాణము లిట్టి పిచ్చిభ్రమలను యెక్కువ బలపరచుచున్నవి. రామాయణమందు నిరూపింపబడిన రాముని శౌర్యమును సీతపాతివ్రత్యమును లక్ష్మణుని విధినిర్వాహకమునకును దివ్యముగానున్నప్పటికి ఒకానొకచో

ద్రుడు తపస్సుచేసి పాపిష్ఠియైనట్లు చెప్పియుండుట చాలాఅసందర్భము. హిందూదేశమును పునరుద్ధరించవలయునన్న వేదమును అర్థజ్ఞానములేక వల్లెవేయించుటగాక అర్థసహితముగ బోధించవలయును. వేదసమాజమువల్ల ప్రచురింపబడిన అర్థసహితమైన యీశోపనిషత్తు మంత్రపుష్పములు మతవిషయమై సంస్కృత పాఠశాలలయందు ప్రప్రథమమున బోధించుటకు తగియున్నవి.

42. మీరు విసుకుచెందనియెడ మన పురాతనాచారములు ఉత్కృష్టమైన ధర్మములను బోధించినవని సిరూపించెదను. అనేకవిషయముల జెప్పి కాలాతీతము చేయుటకన్న కొన్ని సందర్భములను సూచించెదను. ఉపవాసపద్ధతిని తీసికొనియెదము. నిరాహారమనగా నర్థమేమి? తిండిలేక మాడుట గాదు. ఉపవాసము (సమీపించుట) యీరెండు పదములును చేరి ఉపవాసమైనది. మనము విశేషకాలము ప్రాపంచిక విషయములందే గడుపుచున్నాము. కాన కొంతకాలము పరమార్థవిషయచింతన చేయుటకై అనగా జీవాత్మ పరమాత్మలకుగల సంబంధము నభివృద్ధిపరచుటకు ఉపవసించవలసియున్నది. ఈదినమునే ఉపవాస మనుచున్నాము. దేవునితో జీవించుచు వానితో సంభాషించుటయె అమృతపానమొనర్చుట. అప్పుడే మనము తన్మయత్వమొంది దేహపోషణార్థమైన ఆహారమును మరచిపోదుము. ఆహారవిసర్జన మొనర్చుట తాత్కాలికముగా దానియంతటది సంభవించునది. కాని ప్రస్తుతము దీనిభావము మరచి నిరాహారము విధికృతమని

తలంచుచున్నాము. మన మాహారవిసర్జన మొనరించెదము గాని దైవధ్యానమొనర్పము. కాలయాపనమునకు చీట్లాట మొదలైన ఆటలాడుచుందురు. ఇంగ్లీషున నుపవాసమునకు "హోలీడే" అనుచుందురు. ఇప్పుడు దాని "హాలీడే" యని మార్చి ఆటపాటలక్రిందనుపయోగించుచున్నారు. మన ముపవాసదినమున నిరాహారులముగా నుండుచున్నాము. ఉపవాస పద్ధతియొక్క యథార్థతత్వమును గ్రహించి ఆదిన మీశ్వరధ్యానమునకై యుపయోగపరచవలసి యున్నది. ఇదియే యోగముయొక్క సత్యతత్వము.

43. మరియొక యుదాహరణమును గైకొందము. దేవాగారములకు భార్యాపుత్రసమేతముగా మనము వెళ్ళుచున్నాము. అచ్చటననేక స్త్రీపురుషులతో గలియుచున్నాము. కార్యములపట్ల సతిపతులుగలిసి కూర్చొనుచున్నారు. దీని యర్థమేమి? ఇంగుమూలమున మనపూర్వులు జనానా (గోషా)పద్ధతనుసరించి యుండనట్లు విదితమగుచున్నది. ఇట్టితరి మిషను బాలికా పాఠశాలలయందు బాలికలకు బహుమతి నొసంగునట్టి తరుణమున హిందూస్త్రీలచ్చట యున్నారను నెపముచే పురుషులమైన మనను లోనికి రానివ్వకుండుటకు నేను కారణ మరయజాలకున్నాను. స్త్రీపురుషులు దేవాలయమునకలసి మెలసితిరుగుచుండ యిట్టిసభలయం దేలకలసి యుండరాదు? రాబోవువత్సర మది సంస్కరింపబడవలెనని కోరుచున్నాను. దంపతులొకబండిలో కూర్చొని వెళ్ళుచుండిన

యెడల మనమేల పరిహాసమొనర్పవలె? ఇట్టి వాటియందు చెన్నపురి మనకంటె మంచిస్థితియందున్నట్లు కనుపించుచున్నది. చుట్టుప్రక్కల ప్రదేశములుకూడా దాని ననుసరించియుండవలె నని మదీయకోరిక. నేను పాశ్చాత్యపద్ధతుల ననుసరింపుడను చున్నానని నిందించవలదు. మన పూర్వాచారములను మాత్రమే పునరుద్ధరింపవలయునని కోరుచున్నాను. క్రైస్తవ సోదరులకు మన వివాహములందేమి చేయుచున్నామో తెలియక పోవచ్చును. ఇప్పుడు దంపతులు కలిసి భుజింపకూడదు. అది దురాచారమని తలంపబడుచున్నది. వైవాహిక సమయమున నేర్పడిన యాచార మితర కాలమునందేల ననుసరింపరాదు. ఆసమయమున భార్యాభర్తలొకచో కూర్చొని కలసి భుజించెదరు. భర్త విడచివెళ్లిన యెంగిలిపత్రమున వంటవానితో వార్తలు జెప్పుచు భుజించుచుండుటకన్న సతీపతులు కలసి సంభాషించుకొనుచు భుజించినయెడల యెంత సంతోషకరముగా నుండును. వేయేల మన ఋషివర్యులు గరపిన యాచారములనే యనుసరింపవలయునని జెప్పుచు అట్టిబోధలనే జేయుచున్న మన పశ్చిమార్యులకు వందనము లర్పించుచున్నాను.

44. మనపాశ్చాత్య సోదరులచే బోధింపబడుచున్న అద్వైతము మన ఋషులచేతనే బోధింపబడుచున్నది. కాని దాని ననుసరింపవలయును. విగ్రహారాధనము కోతులను పాములనేగాక గోమయమునుకూడా పూజించు అవివేకపు

పద్ధతులను మన వేదమెచ్చటను జెప్పియుండలేదు. క్రైస్తవు లును వానిని వదలివేయుమని జెప్పుచున్నారు. మనముఁ విసర్జించ ప్రియత్నించెదము. యీవిధముననే వర్ణభేదమును బాల్యవివాహ ములను, వితంతూద్వాహములను, సముద్రయానములను, స్త్రీల యెడ గౌరవమును సంస్కరింపవలసియున్నది. ఇవన్నియు సం స్కారములు గావు కాని మన పూర్వుల యాచారములను పునరుద్ధారణము చేయుటమైయున్నది. కాన మీరెల్లరును ముందంజవేసి యిట్టి వాటికై తోడ్పడవలయునని మదీయా శయము.

45. ఆంగ్లేయులు మనకిన్నివిషయములు గూర్చి దెలు పుచుండగా మనమేమియు వారికి బోధింపజాలమా? పూర్వ ఋషులు మనకు దెలిపిన యంశములనెల్ల మనము మరచి పోతిమా? పూర్వాచారములలో మనమిప్పటికి ననుసరించు చున్నవి కొన్ని కలవు. పాశ్చాత్యసోదరు లాగ్రహముచెందని యెడల కొన్ని యుదాహరణముల నిచ్చెదము.

46. (సభయందున్న పాశ్చాత్యులెల్లరుసంతోషపూర్వక ముగా నైకొందుమని నుడివిరి.) భార్య మృతిజెందిన యెడల నాపె సోదరిని వివాహము జేసికొనుట అనేకభంగుల మంచి పద్ధతిగాని పాశ్చాత్యులు దాని ననుసరింపరు. అచ్చట (పాశ్చా త్యులు యీానవీనాచారమునకు తామొప్పికొనినను పార్ల మెంటు యొప్పికొనలేదని నుడివిరి.) హైందవులచే ఆచరించ బడుచున్న యీ ఆచారము పాశ్చాత్యులును త్వరలో స్వీక

రింపోదరని నేను దలంచుచున్నాను. మనవేద మొకము ఖ్యాంశమును బోధించుచున్నది. మనము విదేశీయులచే పరి పాలింపబడలేదని జెప్పుచున్నది. విక్టోరియామహారాణి విదే శీయురాలుగాదు. ఆమె మన ఆర్యసంతతికి చేరినదే. వేలసంవ త్సరములకు పూర్వము విడిపోయిన మన ఆర్యసంతతుల మెల్ల తిరిగి నేడు గలియుట భాగ్యముగాన మనహైందవులును పాశ్చా త్యులును ఒకరి నొకరు సోదరసోదరీభావములతో జూచుచు నొకరినొకరు ప్రేమించు చుండవలసియున్నది. మాక్సుముల్ల రంతటివారే మనమెల్లర మార్యులమనియు మనబంధువర్గమెల్ల హిందూదేశమున నున్నదనియు జెప్పియున్నాడు.

49. సోదరసోదరీమణులారా! మనము మనబంధువులచే తనే పరిపాలింపబడుచున్నారము. సభానాయకునను యిచ్చట నున్న పాశ్చాత్యస్త్రీలును మన సోదరసోదరీమణులే; మనజాతికి చేరినవారే; మనల పరిపాలించుచుండుటెంత సంతోషదాయా కము.మనలనెల్ల పాలించుటకు స్వర్గమందొక ప్రభువున్నాడు. "ద్యాపితా"మనము మతమునందును రాజకీయమునందును మనమెల్లర మొక్కటియేకాన అందర మేకీభవించి పాటుబడ వలసియున్నది. ఈయుపన్యాసము ముగించకపూర్వము స్వర్గమం దున్నమనతండ్రికొక చిన్నప్రార్థనచేసెదను. అటులొనరించుటకు పూర్వము తప్పులనెన్నక యోపికతోనుపన్యాస మాకర్ణించిన సభానాయకునకును సభ్యులకును అందుముఖ్యముగ స్త్రీలకును వందనములర్పించుచున్నాను. ఓద్యాపితా మాపై కరుణింపుము.



నీపితృత్వమును మాసోదరత్వమును మాకెల్లరకు విశదపర
చుము. మేమందర మొక తండ్రిబిడ్డలమైన సహజన్ములవలె
ప్రేమించునట్లుచేయుము. అసూయతను, ఓర్పులేమియు, అల
క్ష్యతను, అసహ్యతను, మానుండితొలగించుము. మే మొకరికొక
రము ప్రేమానుబంధము గలిగి సన్మార్గమున ప్రవర్తించుచు
యజ్ఞానాంధకారమును పారదోలి జ్ఞానజ్యోతిని గాంచి ప్రభువై
న నీవె మాతండ్రివనియు నీవే మాకెల్లరకు తల్లివనియు మేము
స్మరించుకొనునట్లుచేయుము. ఋషులవాక్కు వచ్చినట్లు "అసతో
మాసద్గమయా తమసోమా జ్యోతిర్గమయా మృత్యోర్మా అమృ
తంగమయా" దుష్పథమునుండి తొలగించి సత్పథమున నడుపుము.
అంధకారమునుపారదోలి ప్రకాశమును జూపుము. మృత్యువును
పారదోలి నిత్యజీవన మొసంగుము.



ఓమ్.

# ద్వితీయ వేదోపన్యాసము గుత్తి.

(గౌతమాశ్రమము.)

1889 సంవత్సరం మార్చి 9 తేదీన సాయంత్రము 6 గంటలకు గుత్తి సంస్కృతపాఠశాలాభవనమున యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికానుండి విచ్చేసిన చార్లెస్ ఫ్రాన్సిస్ పోవెల్ గారి యాధిపత్యమున సంస్కృత పాఠశాలాధ్యక్షులును విక్టోరియా జూబ్లి లైబ్రిరీ అధ్యక్షులు నగు ఆత్మూరి లక్ష్మీనరసింహం బి. ఎ. బి. ఎల్. గారు గంభీరోపన్యాసము గావించిరి. తత్సభకు పి. కేశవపిళ్లగారు మొదలగు ప్రముఖులును పెక్కు పండితులును సభ నలంకరించిరి యుండిరి.

## ఉపన్యాసము.

మన మెల్లరము సేశ్వరవాదులమగుటచే ఈకార్యక్రమమును ప్రారంభించక పూర్వము సర్వశక్తియు సర్వకారణ కారణమునైన ఆమహాతేజస్సును ధ్యానము చేయనగును. అందుకుగాను వేదమునుండి యొక చిన్నప్రార్థన మంత్రము నుచ్చరించెదను. ఈప్రత్యేక మంత్రము నిప్పుడు బల్కుటకు కారణమిప్పుడు గ్రహింప గలరు.

ఓమ్ అగ్నే హావ్యగ్ం రక్షస్వా=ఓపరంజ్యోతీ అర్పింప బడిన ఆత్మను రక్షించుము.



వేదార్థ జ్ఞానములేని పండితుడు "ఓయగ్నీ హవ్యమును రక్షించుము. అని యర్థము జెప్పెను. సామాన్య సంస్కృత పాండిత్యమువలన యింతకన్న నెక్కుడు అర్థము లభించ నేరదు. వేదమంత్రముల కర్థము జెప్పునప్పుడు ఏతద్వ్యాఖ్యానమగు బ్రాహ్మణ మనుసరించవలయును. శతపథ బ్రాహ్మణములలో "బ్రహ్మహి అగ్నిః" అని చెప్పబడియున్నది. కాన అగ్ని యనగా బ్రహ్మ లేక పరంజ్యోతి అని భాషాంతీకరించితిని. "హవ్యం" అనునది హు=దాన (అనగా యిచ్చుట) కావున యివ్వబడినదని యర్థము. నాప్రాణమును నాయాత్మను నాసర్వమును ఇచ్చుచున్నాను. తైత్తిరీయారణ్యకములో (3-1) "ప్రా అనిణోహవిః" అని యున్నది. కావున హవ్యమనగా అర్పింపబడిన ఆత్మయని అర్థము జేసితిని. అగ్నికర్పింపబడినది. నిర్జీవమగు ధాన్యము గానేరదు. అది యొక సంజ్ఞయేగాని మరేమియుగాదు. క్రైస్తవుల బైబిలు హిందూదేశమున ప్రచారణ గాకపూర్వమె భాష్యకర్తలగు మహీధరాచార్యులవారు "హే అగ్నే తవసమీపే స్థాపితమిదం హవ్యం త్వంరక్ష" అని విపులముగా నుడివిరి. ఎట్లులన "సుప్తపుత్రమివ బాధకేభ్యః పాలయ" నిద్రించుచున్న కొమరునివలె బాధలనుండి కాపాడుము. అగ్నిలో వేయబడిన జీవరహితమగు ధాన్యమున కిది వర్తించునా? నిశ్చయముకాదు.

ప్రారంభము.

ఒక వత్సరము క్రింద నీమందిరముననే పండితుడును

ప్రజాహితుడునగు నికోల్సన్ అను కలెక్టరుగారు యీ సభ నలంకరించినపుడు నేమీ ఉపన్యాస మొసగెడి భాగ్యము కలిగి యుంటిని. నేనపుడు వేదమును విపులార్థముతో విశదీకరించి యుంటిని. ఇప్పుడు హిందూవేదములలో నొకభాగమునుగూర్చి మాట్లాడుచున్నాను. బాహ్యార్థమున వేదమన ప్రాచ్యప్రతీచీమత గ్రంథములని అర్థము. హైందవమత గ్రంథములనగా శ్రుతి. స్మృతి, పురాణములు శ్రుతి మంత్రము, బ్రాహ్మణమని రెండు భాగములు. మొదటిది మూలమును, రెండవది వ్యాఖ్యానములై యున్నవి. మంత్రమునకు మూలము పరమైన ప్రణవము (ఓమ్) మంత్రము, త్రివిధము, అనగా ఋక్ సామ యజుస్సులు. ఋక్ అననేమి? పాదేనార్థేనచోపేతా వృత్తబద్ధామంత్రాః ఋచః॥ పూర్వమీమాంసలో (1-15) చెప్పబడియున్నది. ఛందస్సు, పాదము, యీరెంటితో బద్ధమైనది ఋక్. "గీతారూపామంత్రాః సామాని" గానరూపముగా నున్నది సామము. "వృత్తగీతివర్జితత్వేన ప్రశ్లిష్టపఠితా మంత్రా యజూంషి" శ్లోకమును గానరూపమును గానిది యజుస్సు. అనగా పరిమాణముగల (సూత్రము) గద్య. వీటినే ఆంధ్రమున పద్యము, కీర్తన, గద్య అని యందురు. వీటియన్నిటికి బ్రాహ్మణము భిన్నముగానుండును. తెనుగున దానిని వచనమందురు. ఈ వివరములనుబట్టి వేదములో నేభాగమునైనను దాని యొక్క రూపమును శైలిని బట్టి ఋక్, సామ, యజు, బ్రాహ్మణములలో నేదియైనది గ్రహించవచ్చును. ఋగ్వేదము

సామవేదము, యజుర్వేదము అధర్వణ వేదమని వేదములు నాలుగు భాగములు. ముక్తికోపనిషత్తు ప్రకారము నవాధిక శతం శాఖాయజుషో మారుతాత్మజ అనునట్లు యజుర్వేదము 109 శాఖలు కలిగియున్నది.

కాని, 1 కధక 2 తైత్తిరీయ 3 మైత్రేయ 4 వాజసనేయములను నాలుగు శాఖలు మాత్రమిప్పటికుండి యున్నవి. ఈ శాఖలెక్కడ వాడుకలోనున్నది చరణవ్యూహవ్యాఖ్యానములో చెప్పబడియున్నది. నేను ప్రచురించిన తైత్తిరీయ సంహితయొక్క ఉపోద్ఘాతములో 5వ పేజీలోగల శ్లోకములను చూడుడు. శ్లోకముల కర్థమేమన "ఆంధ్రదేశమున తైత్తిరీయ సంహితను ఆపస్తంబునిచే స్థాపింపబడినది."

హిరణ్యకేశ శాఖ పరశురామ భూమిలో స్థాపింపబడినది. వంగదేశము (బంగాళ) మొదలగు కొన్ని దేశములలో వాజసనేయ సంహిత యాజ్ఞవల్క్యునిచే స్థాపింపబడెను. గుజరాత్ (ఘూర్జర) దేశమునందు మైత్రేయనీశాఖ నెలకొల్పబడియె; నీశాఖను గురించిన శ్లోకము ప్రమాదవశమున ఉపోద్ఘాతములో మరచుటచే తృతీయానువాకాంతమున ముద్రింపంబడియె. (47 పేజి)

మనము చాలవరకు ఆంధ్రదేశమునకు సంబంధించియున్నవారము. నేటిరాత్రి తైత్తిరీయసంహితలోని యూడనువాకముల గురించి ముచ్చటించ దలచితిని. తిత్తిరిచే అధ్య

యనము చేయబడుటచేగాని ప్రసిద్ధపరచుటచేతగాని తైత్తిరీయ
మని పిలువబడినది-పాణిని (4-3-102)

తిత్తిరిప్రోక్తం తైత్తిరీయం (4-3-101) అర్థమేమనగ ప్రోక్త అనుపదమునకు ప్రౌఢమనోరమ అను గ్రంథమున "పకశ్లేషేణోక్తం ప్రోక్తం అధ్యాయనేన అర్థవ్యాఖ్యేనేనవాప్రకాశితమిత్యర్థః" అని చెప్పబడినది. అనగా తిత్తిరిఋషి యీ శాఖయొక్క ద్రష్టగాడనియు సమకూర్చినవాడుగాని ప్రసిద్ధపరచువాడని గాని తెలుచున్నది. రెండవ అనువాకము యొక్క భాషాంతరీకరణమున చివరభాగమున ౩౨ పుటలో గల శ్లోకమును బట్టి మనపూర్వులు వేదాభ్యాసమును గూర్చి ఎట్టి శ్రద్ధను వహించిరో తెలియగలదు. ఆశ్లోకమున కర్థము చేసికొనునట్టి సూత్రము 5 అనువాకమునగలదు. దానిబట్టి తైత్తిరీయ సంహితలో ౭ కాండలును ౬౫౧ అనువాకములును ౧౨౧౯ ౨౧౯౦ పాదములును ౨౫౩౮౬౮ వర్ణములును గలవు. ఈ ౬౫౧ అనువాకములలో మొదటిమూడు అనువాకములలోని విషయములను గూర్చి ముచ్చటింపదలచితిని. కర్మయజ్ఞమున యీ అనువాకత్రయమొకదినముననే యుపయోగింపవలెనని విద్యారణ్యస్వామి నుడివియుండుటబట్టి నేను వాటి నొకేమాదుగా తీసికొంటిని. వేదానువాకములలో పీఠికయందు కర్ణయజ్ఞము, జ్ఞానయజ్ఞమునకు సంజ్ఞరూపమున నున్నదని చెప్పితిని.

యజ్ఞమన పారమార్థికుడు. యుపదేశింపబడు వాని

యాజ్ఞికులు తిరిగి పిండముగా చేతురు. అనగా వానిని తిరిగి నూతనముగా సృష్టింతురు. ఐతరేయ బ్రాహ్మణమున (1-3) చెప్పబడి యున్నది. పారమార్థిక జీవనమున నభివృద్ధిబొందవలె నన్న ప్రతిమనుజుడును పునః జన్మించవలసిన దే? ముముక్షువంత రంగికముగా నడుగిడిన మార్గమును బోధించు దృష్టాంతరూప మగు కర్మయే కర్మయజ్ఞమైయున్నది. కావుననే కర్మ జ్ఞాన సాధనమని సాధారణముగా జెప్పబడినది.

కర్మయజ్ఞము జ్ఞానయజ్ఞమునకు గుర్తు (అనువాకము 82 నారాయణోపనిషత్తు.) జ్ఞానయజ్ఞమునకు కర్మయజ్ఞమునకు పరస్పర సంబంధముగుర్తుగా జెప్పబడియున్నది. అనువాక ప్రారంభమున ॥తస్యైవం విదుషోయజ్ఞస్య॥విదుషః = జ్ఞానులని యర్థము. జ్ఞానులచేతనే పూజలు సలుపవలసినదిగా నియను వాకములో వ్యాఖ్యానము చేయబడియున్నది. సభ్యులారా! యీ అనువాకము మీకు జ్ఞాపకముండవచ్చును. వేదముల సారాంశము పూర్తిగా గ్రహించుటకిది యే మార్గము. బాహ్య కర్మలాంతర్యకర్మ కన్వయించుచున్నవి. అప్పుడు వేదము యొక్క నిశ్చితార్థము బోధపడగలదు. బాహ్యమునకు చెప్ప బడిన అగ్ని ఆంతర్యమున కన్వయించునపుడు ఆత్మతే జస్సులేక పరబ్రహ్మమని యర్థము. యజమాని అను పదము మీరాత్మగా భావించవలెను. బాహ్యయజ్ఞమునకు పత్ని అవసరము. ఈఉపనిషత్తు అనువాకము "పత్నిశ్రద్ధా" అనగా శ్రద్ధయే పత్నిగా చెప్పబడియున్నది. శ్రద్ధఅనగా నేమి

"ఆస్తిక్యబుద్ధిశ్రేవ" వ్యాఖ్యానకర్త దెలిపియున్నాడు. శ్రద్ధయనగా నాత్మపరమాత్మలయునికియం దాస్తిక్యబుద్ధిలేక దృఢవిశ్వాసము కర్మార్థముగానమిథలనన్నిలో వేయుదురు. దీనికేమి నిదర్శనమన "శరీరమిద్ధం" శరీరము నాశనము చేయును. అనగా కామాదివృత్తుల నశింపజేయును. అనువాకమెల్ల బోధించి మీకు శ్రమనిచ్చుట నాయభిప్రాయముగాదు. మీరు మిగుల శ్రద్ధగాచదివిజూచినయెడ కర్మననుసరించి చెప్పబడిన మహోయదార్థములు విమర్శింపగలరు. వేదమును భాషాంతరీకరించుట కీయనువాకమున్న తదితరములును సహకారములు. ఈపని మిగుల దుస్సాధ్యమైనను పూనికతో సాధించగడంగు వారు సఫలమనోరథులగుదురు. కాని పూర్ణజయ మొందజాలకున్నను జయ మొందగలిగినది ముస్ముందు తమకు మిక్కిలి ప్రయోజనకారియగును. కావున నేనొనర్చు వేదార్థమునందేమైన తొట్రుపాటులుకలిగిన సవరించుటకు సభవారియొక్క యౌదార్యమును మిక్కిలి వేడుచున్నాను. మూడనువాకముల గురించి యిప్పుడు చెప్పుచున్నాను.

మొదటిది. "ఇషేత్వా" అనుమంత్రముతో ప్రారంభమగును.

రెండవది. "యజ్ఞస్య" అనుదానితో ప్రారంభమగును.

మూడవది. "శుంధధ్వం" అనుదానితో ప్రారంభమగును.

మొదటిది జ్ఞానముకొరకు దేవుని ప్రార్థించుటను

బోధించుచున్నది. రెండవది జ్ఞానము వేదము ద్వారా లభ్యమగుననని తెలుపుచున్నది. మూడవది మోక్షమార్గమును జెప్పుచున్నది.

మొదటి యనువాకము శ్రౌతమునుబట్టి యెనిమిది మంత్రములుగా విభజింపబడియున్నది. మిగుల చిన్నది. అది ఇషే. లేక జ్ఞానము అనుపదముతో ప్రారంభ మగుచున్నది.

మానుజుడు జ్ఞానమును కాంక్షించుచున్నాడు. కర్మార్థమున "పెరుగు" అని చెప్పబడుచున్నది. దీని నాత్మార్థమున బలికించిన జ్ఞానము లేక పరమాన్నమని యర్థము. నేను జెప్పబడిన యర్థమును బలపరచెడి ప్రమాణవాక్యములను నాయాంగ్లీకరణమున చేర్చకయుంటిని. ప్రథమానువాకమందలి మంత్రము లన్నింటియొక్క యర్థమునుజెప్పి మీకిప్పుడు శ్రమ నివ్వదలచలేదు. రెండుమాటలుమాత్రము జెప్పుచున్నాను. మొదటి మంత్రమున రెండవ పదము "త్వా" అని యున్నది. సహోదరులారా! ఈ "త్వా" (నీవు) అనునది నేను రహస్య స్థలమందును ప్రార్థనామందిరమందును మరియు సర్వత్ర వీక్షించెడి సర్వాత్మకంబె వేరేమగును?

దేవుడు గాడ్ అని అర్థము జెప్పెదనా దీని యర్థము నుండి గుడ్ అని యగును. వానికి సరియగు నామము నాకు దోచుటలేదు. కావున "త్వా" అని వేదము బలుకుచున్నది.

మనము పరిశోధించవలసిన మరియొక వాక్యము "పశవః" ఐయున్నది. జ్ఞానములేనిచో మనము పశువులమేగద.

కార్యార్థమున బహుచక్కగా పశువులతో బోల్పబడితిమి. కావున కర్మయొక్క జ్ఞానార్థమును దెలిసికొని జ్ఞానులమగుటకు పశువులకంటె యుత్కృష్టులముగావలెను.

రెండవ అనువాకమున భగవద్వాక్యరూపమగు వేదము వలనజ్ఞానమును బడయువచ్చునని చెప్పినట్లుగా మొదటనే విన్నవించుకొని యుంటిని. "యజ్ఞస్యఘోషదశి" ఇది ప్రథమమంత్రము.

యజ్ఞమనసేమి? సాధారణముగా నిప్పుడు జంతువులను బలి యిచ్చుట పద్ధతిగాదని దృఢముగా తెల్పుచున్నది. యజ్ఞమనునది యజఅనగా పూజింపుము అని తైత్తిరీయోపనిషత్తునందు "తపోయజ్ఞః" అను వాక్యమువలన బోధపడగలదు. "తపోయజ్ఞః అనగా తపమె యజ్ఞము. వ్యవహారభాషయందమరమెట్లో వేదభాష కట్లే నైఘంటికముగలదు. వేదనిఘంటువుకు యాస్కమహామునిచే వ్యాఖ్యానము వ్రాయబడియుండెను. ఏతద్వ్యాఖ్యానమునకు యాస్కనిరుక్తమనిపేరు. యాస్కమహాముని యెప్పటివాడో తెలిసికొనినచో ఆయన వ్యాఖ్యానమును తప్పక మీరంగీకరింతురని నావిశ్వాసము. అతడుక్రీస్తు బుద్ధుడు, లోకమునందెల్ల నసమాన నైయాకరణియగుపాణిని, వీరందరికంటె చాలాపూర్వీకుడు. పాణినితిత్తిరని పేర్కొనియుండెను. మరియు యాస్కముని తిత్తిరియొక్కగురువని చెప్పబడెను. "అధ్వర ఇతి యజ్ఞనామ" యజ్ఞము, అధ్వరము, అనునవి పర్యాయపదములని యీఋషి చెప్పియున్నాడు. అధ్వరమ

నగానేమి? "ధ్వరతిహింసాకర్మ, తత్ ప్రతిషేధః" (౧-౮) అని చెప్పి యున్నాడు. ధ్వరఅనగా చంపుట అధ్వరఅనగా చంపకుండుట. నిఘంటువులో నీక్రిందిపదేనుపదములు ఓకే యర్థమును తెలుపునని చెప్పబడియున్నవి. అవెవ్వియనిన "యజ్ఞః, వేనః, అధ్వరః, మేధః, విదథః, నార్యః, సవనం, హోత్రా, ఇష్టిః, దేవతాతా, మఖః, విష్ణుః, ఇందుః, ప్రజాపతిః, ఘర్మః"

సర్వసత్కర్మలకును వ్యర్థమగు యీయజ్ఞమను చక్రనిపదము జీవహింసాత్మకముగా నుపయోగించుట మిక్కిలి దురదృష్టము. మధ్వ, తెంగల వైష్ణవులు యజ్ఞమున జంతుహింసను నిషేధించుట మీరెరింగియే యున్నారు. కావున హిందువులలో సైతము జంతుహింస సర్వత్రయంగీకరింప బడకుండుట "సంతోషకరము. మన్యుః, పశుః, పశుమాలభతే" అనుపదములచే నిట్టి ఘోరహింసాచార మలవడి యుండవచ్చును. ఇది కేవల మలంకారము. "మన్యుః" అనగా అరిషడ్వర్గము గావున మనము కామాదిశత్రువులను నశింపజేయ వలయునుగాని నిర్దోషియగు జంతువునుహింసించుటకాదు. స్వజ్ఞనే యథార్థముగా గైకొనుటచే నిట్టి యనర్థము వాటిల్లినది.

భగవద్వాక్యము పుణ్యమును నిష్కపటమునగు కార్యముల నుద్ఘోషించుచుండునని ప్రథమమంత్రార్థము. ఇట్టి యీశ్వరవాక్కు యెందుగలదు. దాని తత్వవేత్తల కడకేగి తెలిసికొన వలసియున్నది. దానివారాదినుండియు సంరక్షించు

చున్నారు. ఇదియే మూడవ మంత్రార్థము.

తత్వవేత్తలు లేక జ్ఞానులెవరు? ఆయర్థము మంత్రమున "కవయః" అనుపదముచే తెలియనగును. కవయఃఅనగా కవులుగాదు ఋషులని యర్థము. "ఋషయః=కవయః" అని మైత్రాయణి బ్రాహ్మణమందు గలదు. తైత్తిరీయ బ్రాహ్మణము "శిశ్రివాః" అనగా "కవయః" అని యర్థము చెప్పబడియున్నది. ఈపదమును గురించి "క్రాంతదర్శనో భవతి కవితేర్వా" (౧౨-౧౩) అని యాస్కుడు చెప్పియున్నాడు. నైఘంటికములోని పదమునకు మేధావియని యర్థము చెప్పబడియున్నది. ఇచ్చ టనువదించుటకు కష్టసాధ్యమగు పదమొకటి కలదు. అవి "బర్హిః" యీపదమునకు సామాన్యముగా ఒకవిధమగు గడ్డియని యర్థము. ఈగడ్డికొరకు మనము ఋషుల చెంతకు పోవలయునని చెప్పబడియుండెను. ఇచ్చట కొంచెము కష్టము కలదుకాని తిత్తిరోపనిషత్తు మన శ్రమ నివారించుచున్నది. "బర్హిః" అనగా గడ్డియను నర్థమిచ్చట అన్వయించకూడదనియు "అధ్యయనము చేయబడునది" అను నర్థము గైకొనవలయుననియు చెప్పుచున్నది. శ్రీవిద్యారణ్యస్వామి "అధీతం "బర్హిః" అధీతం అనగా "ఉచ్చార్యమాణం" అని చెప్పియున్నాడు. ఈ వ్యాఖ్యాన మీ సందిగ్ధమును నివారించుచున్నది. అనగా ఋషుల చెంతకు గడ్డికొరకుగాదనియు శింపదగినది అనగా వేదముకొరకు బోవలయును. "రోమాని బర్హిః" వెంట్రుకలయొక్క సంజ్ఞయే బర్హిఃయని తైత్తిరీయో

పనిషత్తు నుడువుచున్నది. కాని యీ అనువాక్యములో ౧౪ వ మంత్రమున ప్రయోగించిన విధమున "దేవబర్హిః" అనునది యీ చిహ్నముచే తెలుపబడదు గాన దానికి బ్రహ్మజ్ఞానమనియే అర్థము చెప్పవలసియున్నది.

౧౨-వ మంత్రము బ్రహ్మజ్ఞానమే అనంతపురుషుని వాక్కని చెప్పుచున్నది. తన్మంత్రమున నుపయోగింపబడిన "అదితి" యనుపదమును పరిశీలింపుడు. అదితి యనగా నపారమైనది. కశ్యపుని పత్నియని అన్వయము చేయరాదు.

౧౩-వ మంత్రము "ఇంద్రాణి"ని పొందవలయునని బోధించుచున్నది. ఇంద్రాణి యననేమి? మోక్షము, ఇంద్రుని యొక్క భార్యయని అలంకార రూపముగా చెప్పబడియున్నది. ఈ వాక్యము యొక్క అర్థోత్పత్తికొరకు తెనుగు వ్యాఖ్యానము కనుగొనుడు. ఋక్ నామములు దేవుని హస్తములుగాను, యజుస్సు శిరముగాను అలంకారముగా చెప్పబడి యుండుట లోకవిదితము. కావున ఋగ్యజుస్సామముల మూలమున జ్ఞాన మార్జించదగునని ౧౬-౧౭ మంత్రముల కర్థము.

వేదమతము బహు దేవతారాధనము బోధించుచున్నదని ఆక్షేపించుచున్నారు. మూడవ అనువాక మీఆయాక్షేపణమును తొలగించుచున్నది. దివ్యమైన యీ అనువాకమును ప్రతి ఆర్యుడు మరల మరల బఠించవలయునని మదీయోద్దేశ్యము.

రెండవ మంత్రము వేదశాస్త్రజ్ఞానములేనిచో భిన్నార్థ

మొనరించబడుట కాస్పదమగుచున్నది. సంస్కృతమున లౌకిక పారిభాషలో "ద్యారసి" అన "సివేస్వర్గము" అనియు "పృధి వ్యసి" అన నీదే భూమియనియు అన్వయించును. ఇది స్పష్ట ముగా బహు దేవతారాధనమే కాని యీమంత్రము యొక్క బ్రాహ్మణ మీమంత్రమునకు "స్వర్గమర్త్యలోకముల కాధారు డవు" అని చెప్పుచున్నది.

కావున "అసి" అనుప్రత్యయ ముపయోగించబడునపు డెల్ల ఆధారుడు "అనిజెప్పవలయునేగాని వేగభావమునకు వ్యతి రిక్తముగా బహుదేవతారాధకునివలె అన్వయించకూడదు. మూడవమంత్రమున "వసూనాం" అనుపదముప్రయోగించబ డినది. వసూనాం అనగా "ఆత్మలు" అని బ్రాహ్మణముదెల్పు చున్నది. నాల్గవమంత్రమున "అగ్ని" అనుపదముప్రయోగింపబ డెను. అగ్నియనగా బాహ్యాగ్నికాదు. అంతరాత్మలో వెలుగు జ్యోతి. లేక పరబ్రహ్మమని యర్థము. ఎనిమిదవమంత్రమత్యు త్తమమైనది.

ప్రార్థనవల్ల ప్రయోజనములేదనియు ప్రస్తుతి భగవంతు డాలకించినచో వాడు పక్షపాతియు చపలుడు నగుననియు నిరీ శ్వరవాదులందురు. ప్రార్థనయొక్క ఫలమును స్తోత మనుగ్ర హించుటయందు భగవంతునికిగల నిష్పక్షపాతబుద్ధియు నీమం త్రము బోధించుచున్నది. ఈశ్వరకారుణ్య మభేద్యమగునట్టియు సార్వకాలికమగునట్టియు శాసనము ననుసరించి గలుగుచున్న దని యీ మంత్రార్థము.

మనయొక్క మనోబుద్ధి చిత్తములను భగవత్సంకల్పముతో నేకీభావమొనర్చుటయే ప్రార్థనమనియు ఈశ్వరేచ్ఛ సర్వప్రపంచమునను బహుతరంగ ప్రవాహమువలె వ్యాపించి మానవుడు తనసంకల్పము నధీనముచేసినపుడెల్ల నద్దానితోనైక్యమగుటకు సిద్ధముగనున్నదనియు అర్థము. మరియు భగవత్కృప మిగుల మాధుర్యమును కడుప్రియతమని యీమంత్రము జెప్పుచున్నది. ఈశ్వరసంకల్పముతో మానవసంకల్పము నైక్యమొనర్చుట అది నాశత్వమార్జించుటతప్ప మరెద్దియు కాదు. మంత్రమునందుపయోగించబడిన "ఋత" యనుపదము కడుముఖ్యమైనది. మోక్షముల్లరు వారు యీ వాక్యరమణీయమును గ్రహించి దానిపై ౧౦౦ పుటలవ్యాఖ్యానము వ్రాసి యుండిరి. ఋతమనగా నిత్యమును అమోఘమునునైన శాసమని యర్థము.

"ఊర్మణి" అనుపదమునకు తరగలతో నిండిన లేక ప్రకాశముతో పూరింపబడినదని యన్వయము. అనగా భగవత్కరుణా ప్రవాహము మేరమీరి పొర్లుచుండునని చెప్పుచున్నది. "సంపృచ్ఛ్యధ్వం" అనగా భగవత్కరుణ మనయందు ప్రసరించవలయుననియు అనగా నీశ్వరేచ్ఛతో మనయిచ్ఛ నేకీభవించునటుల మనము వర్తించుచుండవలయునని యర్థము. ఇదియే నిజమైనప్రార్థన. ఇదియే స్వచ్ఛమగుభక్తి. ఈ "కరుణ" సుకర్మయందు "ఆపః" అను సంజ్ఞతో చెప్పబడినది. మనము దేవాలయములకు వెళ్ళినప్పుడు తీర్థమును

గ్రహింతుము. ఉదకము భగవత్కృపకు సంజ్ఞయై యున్నది. బైబిలునందు దీనిని పరిశుద్ధాత్మగా భావింపబడి మనుజుని మీదికి పావురమువలె వ్రాలునని జెప్పబడియున్నది. ఋతమను పదమునకు మోక్షముల్లరుగారు వివరించిన భాగమును నీక్రింద బొందుపరచుచున్నాడను. ఉదారభావముగల క్రైస్తవునకు వేదముయొక్క భావమెట్లుదోచునో దీనినిబట్టి గ్రహింపగలరు.

హిందూదేశమందుగల మన పూర్వపురుషులు నదీనగములందును, సూర్యాంతరిక్షములందును, వర్షగర్జన మేఘములందును, ఈశ్వరశక్తులు తమ యింద్రియములకు గోచరించుటచే వాటిని విశ్వసించుటయేగాక సర్వమతములకు ప్రధానాంశమగు అనంత భావమును ప్రభాతభాసిత సువర్ణమయ పారావారమందును విధి విధానభావమును, ప్రభాకరుని దైనిక సంచారమునందును చూడగల్గిరని వేదమువలన మనకు దెలియుచున్నది.

ప్రతిమానవునిచేతను యోకానొకప్పుడెప్పుడో గ్రహించబడి లక్ష్యముచేయబడు భావము లీరెండును ప్రథమమున ఆవేశమాత్రమే యైనను దదావేశవేగము మనజాతి పితరులయొక్క మనోంతరాళముల జొచ్చి సర్వమును సత్యముగ నుండెనను అవినాశమగు భావమును స్థిరముగా నాటుటయేగాక "సర్వమును సత్యముగ నుండగలదు." అను తీవ్రమగు యాశతో బూరించువరకు నిలకడజెందదు.

(The origin and growth of Religion by Max Muller. page 259)

ఎనిమిదవ మంత్రమందుగల ధనము అన నేమో తొమ్మిదవమంత్రమున నిర్ధారణ చేయబడెను. ధనమనగా "సోమము" యీపదము నర్థము చేసికొనుట మిగుల దుస్తరము. అయ్యది "సు" (అనపుట్టించుట) సు అనుపదము నుండి యుత్పత్తి అయినది. "సుత" అనునదికూడా యీదే యుత్పత్తి గలదు. వేదమున నీరెంటి నొకేమంత్రమున ప్రయోగింపబడినది. సుత లేక సోమమనగ దేవుని పుత్రుడని యర్థము. దేవునివల్ల కల్గునది పూర్ణప్రేమ లేక నమృతమే యగును. కావున "సోమ" లేక "సుత" అను పదములకు భగవత్ప్రేమ యని యర్థము.

ప్రేమవినా మనుజుడు తరింపలేడు. మానవుడా దయను, ఆప్రేమను, ఆజ్ఞానమును, ఆసుధను గ్రోలినచో యమృతుడే యగును. ఇదియే నిశ్చయమగు మోక్షము. (ఋగ్వేదము 8-48-3) సుత, సోమ. అను పదములకు అద్యర్థమును మరచుటచే పురుషారోపణ గావింపబడి పాశ్చాత్య దేశమున దేవుని కుమారుడనియు తూర్పుదేశమున సోమ ప్రభువనియు పూజింపబడుచుండెను. సామవేదములో సోమము యొక్క వర్ణనకలదు. బైబిలునందు సుతునియొక్క వివరణముగలదు "సుత" సోమములను నామములచే బిలువబడు అమృతము లేక భగవత్ప్రేమ మూలమున భగవదైక్యమును గాంచవలెనని యీ రెండు గ్రంధములును బోధించుచున్నవి.

బాహ్యదృష్టికి పరస్పర విరోధమగు ప్రపంచమందలి మతము లకు సమన్వయపరచు మూలసూత్రము యీ తొమ్మిదవ మంత్రమని విశాలమనస్కునికి గోచరించును.

పైన పేర్కొనబడిన నిష్పక్షపాతియగు గ్రంథకర్త 380 పుటలో యీ విధముగా రచన మొనరించెను.

సర్వమతస్థాపకులకంటె క్రీస్తుయొక్క బోధ ప్రప్రథమ మున అత్యున్నతములగు సత్యములను వెలిబుచ్చి యూదియా వర్గంగులను, రోమనుమధ్యవిక్రయులను, గ్రీకుతత్వవేత్తలను మోసమునుండి తొలగించి సమ్మేళనము జేయగలదగుటచేతనే ప్రాపంచకమున మిగుల యుత్తమభాగమును జయింపగలిగెను. ఆదికాలమునుండియు మా మతముయొక్క బాహ్యవికసనమును సంకుచితపరచుటకు ప్రయత్నములు గావింపబడుటచేతను యీ మతముయొక్క ముఖ్యపోషకులుగా నుండదగినవారిచే భక్తివి శ్వాస సిద్ధాంతములకు మారు మూఢరాద్ధాంతములను స్థాపిం చుటచేతను క్రైస్తవమతలోక విస్తీర్ణమగు ప్రేమ మతముగా నుండుట ముగిసినది.

"మరియు 385 పుటలో యిట్లు జెప్పియున్నాడు" హిం దూ దేవాలయములలోను, బౌద్ధవిహారములలోను, మహమ్మ దీయ మసీదులలోను, యూదుల సమాజమందిరములలోను, క్రైస్తవుల చర్చీలలోను గావింపబడు ఆరాధన బోధనవిషయ ములలో చాలావరకు వదలివేసినను ఒకవిషయముమాత్రము చెప్పవలసియున్నది. ఏమన ప్రతిమతస్థుడును తాను మిగుల నతి

శయముగా నెంచునొక యుత్కృష్టభావమును ఆమరణాంతమూ
దర్శముగా గొనియుండును. అనగాపరమావధిగా భావించును
అదెల్లనిన:—

హైందవుఁడు ఐహికమందలి యవిశ్వాసమును ఆముష్మికమందలి నిశ్చల విశ్వాసమును జూపుచున్నాడు. బౌద్ధుడు నిత్యవిధానమును బొడగాంచి యద్దానికి వినమ్రుడై పరమసాత్వికుడై దయార్ద్రహృదయుడై యుండును. మహమ్మదీయుడు తక్కినవిషయములెట్లున్నను గంభీరుడై యుండును. యూదుడు కష్టసుఖములందెల్ల పవిత్రతను గోరునట్టియు "నేగలను" అను నామము గలిగినట్టియు ఏకేశ్వరునాశ్రయించియుండును. అనంతుడును, అదృశ్యుడును, అవ్యయుడును, తండ్రియు సర్వాతీతమగు నాత్మయు ప్రేమరూపమున మనుజునియందు బాహ్యాంతరముల వ్యక్తమగునదియు సజీవనిర్జీవపదార్థముల యెడగల ప్రేమయు సజీవమును అమృతమునగు ప్రేమయు, మరియు నింకెన్ని విధముల నామములనిడినను యా దేవునొక్కనియెడ ప్రేమచే క్రైస్తవుడలరారుచుండును. ఇట్టి క్రైస్తవుడందరికన్నమిన్నయగు. కాదంటిరేని పరిశీలించిచూడుడు.

ఈశ్వరమత కేంద్రీకరణ మిప్పుడుచిన్నదియై, అంధకారబంధురమై యుండినను బహుజనకంఠస్వరములను పలువిధ కాంతిపుంజములను నిరసించదలచిన వారిప్పటికి నచటికేగుచున్నారు. కాని కాలక్రమమున అయ్యది వైశాల్యమునందును ప్రకాశమునందును యభివృద్ధిజెంది పూర్వదేశమే భవితవ్యతా

దేశమై విలసిల్లదని యెవరు చెప్పగలరు. మిత్రులారా! యీ యనువాకమం దెట్టి యుపమాలంకారము ప్రయోగింపబడెనో చూడుడు. మానవునియాత్మ క్షీరములకు బోల్చబడినది. భగవత్కారుణ నీరము కుపమింపబడినది. భగవత్ప్రేమయు భగవధ్యానమును దధి (పెరుగు)గా వర్ణింపబడియె. జీవాత్మయొక్క ప్రయోజనము పరమాత్మతో నైక్యముగాంచుటయే. జలదుగ్ధములతోడను దధిలేక సుధ (అమృతము) తోడను అనగా జీవాత్మ భగవత్కారుణను బొందవలెను. ఆత్మవిజ్ఞానములేక ప్రేమజీవని స్పృశించినచో అదికూడా దధిలేక పియ్యూషరూపమును బొందును. అంత "ఇంద్రాయదధి" యనునట్లా పరాత్పరునిచే స్వీకరింపబడును. కాన మనమెల్లరము ద్వేషమును విడిచి యీ యనువాకమున బోధించబడిన పదవిని బొందెదముగాక.

ఓమ్.

విజయనగరమ మోతీమహాల్ భవనమున ఆనరబుల్ హిజ్, హైనస్ శ్రీ పూసపాటి ఆనందగజపతిరాజ మహారాజా క, శి, ఐ, ఇ, వారి అధిపత్యమున నొసంగిన యుపన్యాసముల సంక్షేపము

ఆగ్రాసనాధిపా! పండిత సభ్యులారా!

వేదమను పదము "విద" (అనగా తెలిసికొనుట) యను క్రియనుండి యుత్పన్నమైనది. కావున వేదమునకు జ్ఞానమని యర్థము. ఈపదమును వ్యుత్పత్తి యనేక విధములుగా నున్నను నేనీయర్థమును స్వీకరించెదను. ఈపదము ప్రథమము "త్రయీ విద్య" అనగా ఋగ్వేద సామవేద యజుర్వేదముల కన్వయింప జేసిరి. తదుపరి మంత్ర బ్రాహ్మణములకు కూడా నన్వయింప

జేసిరి. పురాణకాలమున దానిని మహాభారత రామాయణాది గ్రంథములకును మరియు నీకాలమున బైబిలునకు గూడా వేద మని నామ మిడుచున్నాము. నేను దానిని మంత్రిభాగమునకు మాత్రి మన్వయించుచున్నాడను. ఏలనన బ్రాహ్మణము కేవల వ్యాఖ్యానమేగదా. మీరు దానిని వెంటనే యొప్పు కొనకుగాని విద్యారణ్యభాష్య మందే యిందులకు బ్రిమాణము జూపించెదను. విద్యారణ్యులు కృష్ణయజుర్వేద భాష్య మున నీక్రింది విధముగా జెప్పుచున్నాడు.

"యద్యపి మంత్రి బ్రాహ్మణాత్మకో వేదాః తథాపి బ్రిహ్మణం సమంత్రి వ్యాఖ్యానరూపత్వాత్ మంత్రఅవఅర్థాన సమామ్నధాః" నే నేపద్ధతి ననుసరించి వేదమున కనువాదను జేయుచున్నాడనో మీకు వివరించెదను. ఏవిషయమునైనను ప్రిమాణముజూపక యథార్థనిర్ధారణము జేయుట నాకిష్టములేదు. హిందూదేశము నలంకరించిన యాస్క, కుమారిల భట్ట శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్య భట్టభాస్కరాచార్య, శ్రీధరాచార్య, దయానందస్వామి మొదలగు మహాపురుషులను ప్రమాణముగా గొనుచున్నాను. వారి ప్రామాణ్యము లంగీకరించిన యెడల నా వాక్యముల స్వీకరింపుడు. లేకున్న పరిత్యజింపుడు. ఇందుగల రాజచంద్రునికిని ప్రముఖులకును విన్నవించునదేమన కేవలమొక వ్యాఖ్యానకర్త నను సరించుటచే నిజమైన యర్థము పూర్ణముగా జెప్పజాలముగాన వేర్వేరు వ్యాఖ్యాన కర్తలను సంప్రిదించి సత్యమును గ్రిహిం

చుట మిక్కిలి యవసరము. మన పూర్వులెల్లరును సత్యమునుదప్ప మరెద్దానిని గోరలేదు. కాశీ మహారాజుగారు "సత్యాన్నాస్తి పరోధర్మః" యను వేదవాక్యము నాదర్శముగా గైకొనియున్నాడు. పూర్వకాలమున సత్యమును బోధించుటకు మహర్షులు గలరు. ఇప్పుడో వారులేరు. అట్లైనచో యెవరి నాశ్రయించవలెను? మనచెంతనుండి యెప్పుడును మరుగువడని యొక ఋషిసత్తముని భగవంతుడు మనకు ప్రసాదించియున్నాడు. ఆముసిపుంగవు డెవడు? మహానుభావుడగు యాస్కాచార్యులిట్లు సమాధాన మొసగుచున్నారు.

"మనుష్యావ ఋషీషు ఉత్క్రామస్తుదేవాన్ అబ్రువాన్ కోనఋషిర్భ విష్యతీతి తేభ ఆనమః తర్కఋషిమ్ ప్రయచన్ మంత్రార్థ చింతాభ్యూహః మభ్యూతమ్ తస్మాత్ అథేవాకిమ్ చనూచనో అభ్యూహత్యార్షంతద్భవతి (నిరుక్తం ౧౩ అధ్యా ౧౨ ౮)

తర్కమే గొప్పఋషిగా భావించుచున్నాను. వార్టేర్ అనునాతడు తర్కమును లోకరాజ్ఞియని పిలచియున్నాడు. మనమీ ఋషిని విడువకూడదు. మనపరిశోధనలలో నీమర్షిని మనచెంత నుంచుకొనవలెను. అతడులేనిచో మన మపజయ మొందుట నిక్కవము.

ప్రస్తుత హిందూమతము వేదాభిప్రాయమునకు భిన్నముగా నున్నదని నాయభిప్రాయము. వేదమతము విశుద్ధమును విస్పష్టమునైన౧౯వ శతాబ్దముయొక్క పరీక్షకునిలుచుచున్నది. అయ్యుద ప్రస్తుత శతాబ్దమునంగల సర్వశాస్త్రపరి

శోధనల కనకూలముగనున్నది. మహాదేవకుని వేదమతము లేక మంత్రిమత మీవిధముగా చెప్పబడినది:—"ఋషి" యన తీవ్రముగ నాలోచించువాడు ధ్యాననిమగ్నుడై ప్రార్థనావచనములను బల్కును. మఱియు గానమొనర్చును. ఆతని నతులను కీర్తనలను మానవుని పరమోన్నత మతాదర్శములను బోధించుచున్నవి. పూర్ణవిశ్వాసియై జీవితమున సర్వకాలముల యందును భగవత్సహాయమున నాధారపడియుండును. మనుజుని మనమునగల సుగుణదుర్గుణపుంజముల పోరాటమును గుర్తెరింగియే యున్నాడు. సద్గుణము దుర్గుణమును జయించవలెనని మనఃపూర్వకముగా నాతడు ప్రార్థించుచుండెను. తన బుద్ధిని సర్వదా ప్రేరణచేయు భగవంతుని విశ్వసించుచున్నాడు. ఆత్మయొక్క అమృతత్వమును దృఢముగా నమ్మి ఆదిపురుషు లవలంబించిన ధర్మమార్గమును పరమానందముగా గీతిక౯ంచును. అతడు మోక్షమును నిర్మలమును ఆధ్యాత్మిక మగురీతిని వర్ణించెను. (షడ్దర్శన చింతానిక ఉపోద్ఘాతము పుట 5) పరమాత్మ తత్వమును గురించియు నీశ్వరుని యెడలను తోటిజీవుల యెడలను మానవు డాచరించవలసిన విధులను గురించియు హిందూదేశమున వ్యాపించిన యజ్ఞానమును వేదవిజ్ఞానము నసింపజేయుచున్నది. విద్యారణ్యులు కృష్ణ యజుర్వేదములోని ద్వితీయకాండయొక్క పీఠికలో నిట్లుజెప్పియున్నాడు.

"వేదికమే యథాధర్మ బ్రాహ్మణో వేదమానధో

......" ధర్మము, బ్రహ్మము యీ రెంటిని గురించి వేదము బోధించుచున్నదని యీవిద్వాంసుని యభిప్రాయము. వేదము నందొక భాగము ధర్మమును గురించియు మరియొక భాగము బ్రహ్మమును గురించియు జెప్పుచున్నదనుట తప్పు. బ్రహ్మకాండనుండి కర్మకాండను వేరుచేయుటకు వీలుకానంతటి మేళనముగలిగి వేదముయొక్క వివిధభాగము లలరారుచున్నవి. కావున బ్రహ్మను గురించియు, ధర్మమును గురించియు, గ్రహించుటకు వేదమంతయు చదువవలసినదే.

వేదమంత్రములు ఋజున్నామములతో గూడియున్నవి. ఆరణ్యకమునందు "తస్యయజురేవ శిరః ఋద్దక్షిణ పక్షః సామోత్తరపక్షః" చెప్పబడియుండగా దీనియర్థమును తిన్నగా గ్రహించక కొందరు యజుర్వేదము తక్కినవాటి కంటె నుత్తమమైనదనియు పోరాడుచున్నారు. ఈ పైన జెప్పబడిన వాక్యముయొక్క యర్థము మిగుల సులభము. యజుస్ అనగా వచనము. ఛందోబద్ధమగు వచనము. ఋక్కనపద్యము. సామమనగా గానము లేక కీర్తన. వచనము పద్యగీతములకంటె మొదటిదని చెప్పనగును. వచనమునుండి పద్యగీతములు రెక్కలవలె వెలువడుచున్నవి. అన్నియు సమానప్రాముఖ్యము గలవియే; యజుర్వేదములో వచనభాగ మెక్కువగానుండుటచే నట్లు పేర్కొనబడియె; అట్లే ఋక్సామముల నూహింపదగినది. ఈవిషయ మింక నెక్కువగ తెలిసికొనగోరిన విద్యారణ్యకృతమగు జైమిని న్యాయమాలను జూడుడు.



పైవాక్యములో యజుస్సనగా వచనమేగాని యజుర్వేదము కాదని మీలో కొందఱభిప్రాయపడుచుండిరని తలచెదను. అట్లయినచో నాయభిప్రాయము నీక్రింద నుదహరింపబడి శ్రీ శంకరాచార్యులవారి వాక్యమును బలపరచుచున్నది.

"యజురితి అన్యథా అక్షరపదవసనో మంత్రవిశేషః తజ్జాతీయవచనో యజుశ్శబ్దః" ఆనందవల్లి, పేజి 27 సౌకర్యము కొరకు ధర్మము బోధించునది యుపనిషత్తనియు పేర్కొనబడియె. ఉపనిషత్తనగా దేవునిసాన్నిధ్యమునకు గొనిపోవుచున్నదని యర్థము(తారానాథవాచస్పతినిఘంటువు)ఉపనిషత్తులు సామాన్యముగా పదియనిచెప్పబడెను. అవియు గణితములు. శంకరాచార్య రామానుజాచార్య మధ్వాచార్యులు మొదలగువారిచే వ్యాఖ్యానములు చేయబడిన ఉపనిషత్తు లనేకములు గలవు. అయ్యవి కర్మకాండలలో గన్పట్టుచున్నవి. తైత్తిరీయ సంహితలో నంత్యనువాక ముపనిషత్తుగా విద్యారణ్యులు పరిగణించుచున్నారు. ఆయనువాకమునకు భాష్యములో నతడిట్లు జెప్పుచున్నాడు. (651)

("యోహిఅశ్వశ్చమధస్య శిరోవేద.........")

"సర్వజగదాత్మ తత్వేన అశ్వహస్తూయతే" అథవా విరాడ్రూపేణ అశ్వోపాసన ప్రతిపాదకోయం అనువాకః అకరణాత్ ఉత్కృష్య ఉపనిషదధ్యేతవ్యః"

ఇట్లే పరమాత్మగూర్చి చెప్పువాక్యములు సంహితలలో నింక పెక్కులుగలవు. ఉపనిషత్ నామమున కవియు

నష్టములే. ఉపనిషత్తులలోకూడా "సత్యంవద" "ధర్మంచర" మొదలగు ధర్మబోధకములగు వాక్యములుగలవు. వేదమందు ధర్మమును బోధించుభాగమును పరమాత్మను బోధించుభాగమును విడదీయరాదని యొప్పుకొనకతప్పదు.

"ఉపనిషత్" అనుపదమునుగూర్చి యొకమాటచెప్పవలసియున్నది. ఉపనిషత్తులవ వేదభాగములేగాక ప్రస్తుతకాలమున తదితరములనేకములు ఉపనిషత్తులని తేర్కొనబడియున్నవి. వంగదేశములో సివిల్ సర్వీసులోనున్న దత్తుగారి "ప్రాచీనహిందూదేశము" అను యుద్గ్రంధమునుండి యొకవాక్యము దృష్టాంతముగా జెప్పుచున్నాడను. (178 పుట)

"ఉపనిషత్తులు పవిత్రమును ప్రమాణగ్రంధములను విఖ్యాతిగాంచిన తోడనే మరియు నట్టి... మరికొన్ని గ్రంధములను నవీనముగా సృష్టించి షు... ంపు చేసిరి. సామాన్యముగా నిటీవల... లు పురాణకాలమువగ... మున ప్రాచీనో...

"ఓమ్ అస్మల్లాం ఇల్లా మిత్రావరుణో దివ్యనిధత్తా ఇలల్లా వరుణో రజాపునర్థతుః హయామిమిత్రో ఇల్లాం ఇల్లిల్లా యిల్లిల్లాం వరుణో మిత్రో తేజ కామాః హెూతార మిన్ద్రో మహాసురిన్ద్రాః అల్లో జ్యేష్ఠమ్ శ్రేష్ఠమ్ పరమమ్ పూర్ణమ్ బ్రహ్మణమిల్లం అల్లో రసుర మహామతరకం వరశ్చ అల్లోఅల్లం అథల్లవుక మాకకం అల్లాం వుకమ్ నిఃఖేధకం అల్లో యజ్ఞైన హుత హుత్వాః అల్లా సూర్యచంద్ర సర్వ నక్షత్రాః అల్లో ఋషీణాంశ దిత్యేంద్రాయ పూర్వం మాయాపరమాణః అంతరిక్షాః అల్లోపృథివ్యా అంతరిక్షం విశ్వరూపం దివ్యానిధాతే ఇల్లిల్లా వరుణోరాజ పునర్దదుః ఇల్లేకవర ఇల్లాకవర ఇల్లిల్లాతి ఇల్లిల్లాః ఇల్లా ఇల్లిల్లా అనాది స్వరూప అథర్వణో శాఖం హ్రూం హ్రీం జనాన్ పశూన్ సిద్ధాన్ జ... ...ష్టం కురుకురుఫట్ అసుర సంహారి ... మహామదరకమ్ వీర్యశ్చ అల్లో

... తెలిసికొన మీరు

...వగా

చర్చించుటకు హితవుగానుండును. కాని యర్థముతో జదివిన వాటి ఘనత యంతయు నీల్గునని కొందరు భావించుచున్నారు. వేదముపైగల యీ దురభిప్రాయము సరియైనది కాదు. వేదము మున్నాటికిని పెన్నిధివంటిదనియు తర్కసహాయముతో చక్కగా చదివినయెడల తప్పక నందు పెన్నిధానము చూడగలరనియు ఘంటాపథముగ జెప్పుచున్నాను.

వేదార్థమును గ్రహించుట కొక విద్యారణ్యమును మాత్రమే చేకొనిన జాలదు. అతనియెడల నాకతి గౌరవము కలదుకాని యతడు పొరపాటులేని మార్గదర్శియని నే నుడువ జాలను. అతడన్ని వేదములకు వ్రాసినను అవి యన్నియు తానే స్వయముగా వ్రాసెనని నేను నమ్మజాలను. నా భావమిట్టుల వెలిబుచ్చినందులకు నాయందాగ్రహింపకుడు. మైసూరులో నిటీవల గావింపబడిన శోధలచే పెక్కు ముఖ్య విషయములు వెల్లడియైనవి. వ్యాఖ్యానములు వ్రాయుటలో విద్యారణ్యస్వామికిని, సాయనాచార్యునికిని, మధ్వాచార్యునికిని, సహాయ మొనరించినందులకు గొప్పపండితులకు భుక్క మహారాజుగారు భూములను గ్రామములను దానమొనర్చినట్టు లక్కడి శాసనములబట్టి తెలియవచ్చుచున్నది. ఆ వ్యాఖ్య యంతయు నొకనిపనిగాదు. అతడు కేవలము వ్యాఖ్యానము చేసెననుటకంటె సరిచూచెననుట యుక్తము. అతని వ్యాఖ్యానములలో స్పష్టముగ లేకుండినగాని అసందర్భముగా నుండినగాని తక్కిన వ్యాఖ్యానముల సహాయముచే విషయముల

చక్కగ బోధపరచుకొనవలెను. ఓ పండితులారా! యనుగ్రహించుడు. విద్యారణ్యుని పూర్వీకుడగు భట్టభాస్కరాచార్యులును తరువాతివాడగు మహీధరాచార్యులను జేర్కొనసిందు. ఏదో యొక శాఖకు మాత్రము బద్ధుడగుట చాలదు. కొన్ని సమయములందు వివిధ శాఖలయొక్క వివిధ వ్యాఖ్యానములను జదువుటచే విషయము బాగుగా బోధపడును. వానినే బ్రాహ్మణము లందురు. గూఢమగు తావులయందెల్ల వాటిని జూడుడు. అవి తప్పక మీకు సహాయమొనర్చును.

వేదవ్యాఖ్యానము జేయుటలో రెండు మీమాంసలు మిగుల సహాయము చేయుచున్నవి. పూర్వమీమాంస ధర్మమును బోధించుచున్నది. అందు ప్రథమ సూత్రము. "అథాతో ధర్మజిజ్ఞాసా" ఉత్తర మీమాంస పరబ్రహ్మమునుగూర్చి చెప్పుచున్నది. అందు ప్రథమ సూత్రము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యీరెండు మీమాంసలును పరస్పర విరోధమని తలంచుట తప్పు. అయ్యవి యానుకూల్యతనే గలిగియున్నవి. అవి కొన్ని స్థలములలో నభిప్రాయభేదమును గనపరచినను వైరుధ్యములు గానేరవు.

శ్రుత్యర్థమును బాగుగ గ్రహించుటకు రెండు మీమాంసలకుగల పరస్పర సంబంధముగూర్చి కోల్బ్రూకు అను పండితోత్తముని యీవాక్యము కంటె చక్కగా జెప్పజాలము. "హిందూతర్కశాస్త్రమును గురించి వెనుక నుదహరింపంబడిన యొక వ్యాసము కర్మ మీమాంసనుగూర్చి సంక్షే

పముగా జెప్పుచున్నది. ప్రస్తుతము బ్రహ్మమీమాంసనుగూర్చి చెప్పుచున్నాను. ఇందు మొదటిది పూర్వమీమాంసయనియు రెండవది అనగా నిటీవలదియగు ఉత్తర మీమాంసయు రెండును కలసినప్పుడే సంపూర్ణ శాస్త్రమగునని జెప్పవలయును. ఏలనన పూర్వ మీమాంసకర్మలను, వాటి ఫలములను, బోధించును. మరియు నుత్తర మీమాంసయన్ననో వేదము నాధారముగాగాని వేదాంతమును కార్యకారణ వాదరూపముగా బోధించుచున్నది. కావున రెండునుచేరి అనుభవ రూపమును వాదరూపమునగు వేదసిద్ధాంతోపదేశ సంపూర్ణ వ్యాఖ్యానమై యొప్పారుచున్నవి. ఆ రెండు నొకదాని భాగములు. పూర్వమీమాంస ఉత్తరమీమాంస పూర్ణశేషమని చెప్పవచ్చును. ఈవిషయము నిర్ధారణ చేయబడినది. కాని కొన్ని విషయములలో వ్యత్యస్తము కొన్నింటిలో నేకీభావము గల్గిన నయ్యవి వేదాంతదృక్పథమున దేనికది వేరని చెప్పవలయును.” (వాల్యూం 1 పేజి 325.)

జైమినిగాని బాదరాయణుడుగాని నేను జేసిన భాషాంతరీకరణములో జ్ఞానార్థమును నిషేధించలేదు. అంతేగాక వారును అచ్చటచ్చట తత్వార్థమును సూచించిరి. అయితే మీరు కర్మను చేయకూడదని నాయభిప్రాయముగాదు. మీరెన్ని యజ్ఞములైనను జేయవచ్చును. మిమ్ముల నేను ముఖ్యముగ కోరునది కర్మ నొనర్చుటయేగాక దాని శమ్యార్థమును కూడా తెలిసికొనవలెను. శ్రౌతములో కర్మ విధానము చెప్ప

బడియున్నది. కర్మయననేమో దానిలో చెప్పబడలేదు. యజ్ఞము సంజ్ఞారూపముగానున్నది. యజుర్వేదమునకు నేను వ్రాసిన యాంధ్రీకరణమున నాయర్థమును జెప్పియుంటిని.

కర్మ యుపమానరూపము. అనగా సంజ్ఞారూపము అది యెప్పుడు నున్నత సత్యంబులను బోధించును. లేదా పూర్వ సమాచారమును దెలుపును. మీరు యజ్ఞమొనర్చునపుడు దాని యుద్దేశార్థములను గ్రహించవలయును. నేనిప్పుడు వ్యాఖ్యాన మొనర్చిన ధర్మమిట్టి మానవుని నిత్యవిధులను ప్రతిపాదించుచున్నది. ఈకర్మ నుపమానముగా దెలిసికొనవలెను. దానినుండి ఉపమేయమభ్యసించుకొనుడు. సంహితలిప్పుడు చేయబడినట్టి బాహ్యకర్మనప్ప అంతరార్థమేమియు లేదని దలచినచో బాగుగ మీరు పరిశీలింపలేదని చెప్పగలను. శ్రుతుల కంతరార్థమును జెప్పుటలో నేనుగాని కడపట వేదమున కంతరార్థము వ్రాసిన దయానందుడుగాని తప్పెనచో ఋగ్వేదమున కధ్యాత్మపరముగా వ్యాఖ్యాన మొనర్చిన మధ్వ మతస్థాపకుడగు శ్రీమధ్వాచార్యు లెట్లుతప్పుగునో పండితోత్తములు జెప్పవచ్చును. ఋగ్వేద ప్రథమమంత్రమునకు దయానందు డొనర్చిన వ్యాఖ్యయును మధ్వభాష్యము నుండి కొన్ని ముఖ్యవాక్యములను ఇందుదహరించుచున్నాడను. మంత్రము అగ్ని......సర్వవేదార్థతత్వం (131 పేజీ) టీకాచార్యులనుండి రెండువాక్యములను జెప్పదలచితిని. "ఏవ మనుమానె.. ......పరోక్షమ్".

కర్మ నొనర్చునప్పుడు సోమమును సోమలతగాని సోమ రసమునుగాని ప్రత్యామ్నాయముగా వాడుచున్నారు. ఆధ్యాత్మకార్థములో సోమమన అమృతమని యర్థము. "తృతీయ స్యమితోదివి సోమఆసీత్" అను వాక్యములో సోమమన నెట్లన్వయించిరి. బ్రాహ్మణములో "ఇషేత్వా" అను యను వాకమును గూర్చినదై యున్నది. కర్మ కాండాంతర్గత మగు భాగమున గల సోమమను పదము భాష్యకారులని ప్రసిద్ధి వడసిన రామానుజాచార్యులచే నెట్లు వ్యాఖ్యానము చేయబడినదో గాంచుడు. అది తప్పని మీరనజాలరు. విద్యారణ్యుని కంటె నతడు మిగుల ప్రాచీనుడు. భాష్యకారులు విష్ణుసహస్రినామ వ్యాఖ్యానమున సోమమననమృత వీచియని చెప్పి యున్నాడు. కర్మకాండ జ్ఞానార్థము బోధింపనిచో సోమమన అమృత మెట్లగును. కర్మకు జ్ఞానార్థము లేదను వారెవరైనను రామానుజ మధ్వులు తమ వ్యాఖానములం దెచ్చట నక్రమ మార్గమున నడచియుండిరో ప్రితిపాదింపుడు. మీరు వారిని తప్పని జూపినగాని వారి ననుసరించు నాపై మీ రాగ్రహించిన లాభములేదు. మీమాంసవ్యాఖ్యాన సూత్రిముల నీయాచార్యు లెట్లత్రిక్రమించిరో తెలుపకోరెదను.

మహాత్ముడగు శంకరాచార్యుల విషయమై విచారింతము.ఆయనవిషయమై చెప్పకపూర్వముఛాందోగ్యోపనిషత్తును గురించి ఒకటిరెండు మాటలు నుడువవలసియున్నవి. అది ఛాందోగ్యబ్రాహ్మణమను సామవేదమునకు జేర్పబడిన దశాధ్యా

యములతో గూడియున్నది. సామవేదము ఎనిమిది బ్రాహ్మణములు గలిగియున్నది. ఈబ్రాహ్మణమునుండి చివరధ్యాయము లెనిమిదిగైకొని ఛాందోగ్యోపనిషత్తను పేరుబెట్టిరి. ఇందు మొదటి రెండధ్యాయములు మంత్రబ్రాహ్మణమని యందురు. ప్రథమాధ్యాయద్వయము జేర్పకున్నను కర్మనుగూర్చిన వాక్యములే ఉపనిషద్భాగంబున పెక్కులుగలవు. నేనొకవాక్యము నుదహరించుచున్నాను. "దేవాసుర...అరజవత్యాః" కర్మార్థమునుబట్టి దేవాసురులు యుద్ధముజేసి నట్లన్వయించును. దీనికంటె నుత్కృష్ట భావ మిందులేదని మీరుతలచెదరా? శంకరులు కలదనినచో మీరు సమ్మతించెదరా? అతడేమిజెప్పెనో జూడుడు:—"దేవాసురాః... .....అభిప్రాయస్సనిర్ణిః" శంకరాచార్యుల వ్యాఖ్యానము సామాన్యముగా గ్రహింపబడునట్లుగాక కర్మకాండకు మిగుల నుత్కృష్టమగు సందేశముగలదిగానున్నదని నేను నొక్కి జెప్పుచున్నాను.

ఆపవిత్రిపంతులగు గురువర్యులు దీనిని కర్మకాండను గురించియే జెప్పియున్నారు. ఇయ్యదొక యుపనిషత్తునందు గలదని జెప్పినంతమాత్రమున సమాధానముకానేరదు. ఈయుపనిషత్తు పైనజెప్పినరీతిగ బ్రాహ్మణములోని యంతర్భాగమే ఈముప్పురు భాష్యకారులును తప్పెజెప్పిరనినచో నేను మీతో వాదింపజాలను. మీరిక వారితోడనే వాదించవలసియుండును.

నేనిప్పుడు స్పష్టమైన దృష్టాంతముజెప్పి,కర్మకు కేవలబాహ్యవ్యాపారమేగాక నతీతమగు వ్యవధికలదని నిరూపించెదను.

ఇటుల నిరూపించుటకు వేదముయొక్క మొదటి యనువాక మునే తీసికొందును. అందు ప్రథమమంత్రము "ఇషే.త్వా" దీనికి విద్యారణ్యస్వాములవారిటు లన్వయించిరి. "హేపలాశ......ఏచేహినాద్మి" మహీధరాచార్యు లిటుల జెప్పినారు. "హేశాఖ......అచేహివాద"దయానందులు:—"ఇషే... పరమేశ్వరా" మొదటి రెండు మంత్రములును కలపి అర్థము చేయవలెను. వేరుగ నన్వయించవలెనో మనము చర్చించ నవసరములేదు. బోధాయనాచార్యుడును బ్రాహ్మణమును మైత్రేయిని శాఖయు నొకటిగాజెప్పినాడు. ఆపస్తంభుడు తటస్థముగా నుండెను. ఒకటిగాగాని రెండుగాగాని వ్యవహరింపవచ్చునని యితని యభిప్రాయము. జైమిని మీమాంసలో వేర్వేరు మంత్రములుగా జెప్పియున్నాడు. కావున మనమట్లే గైకొనిమెదము. ఆమంత్రములో "ఇషే" "త్వా"యను రెండు పదములు మాత్రముకలవు. అందు మొదట పదమునకు ఇషమ్ అనియు, రెండవదానికి నీవనియు నర్థము. ఇందు నీవను సర్వనామమును దెలుపు నామవాచకము పూర్వమందేమియు లేదు. కర్మయందు పాలాశము(యొక్క (Butea Prondosa) యొకభాగమును మాత్రము గైకొనబడినదని యందరొప్పుకొనిన విషయమే. ఈ భాగమెందులకు తీసికొనబడినదో దాని యర్థమేమో భాష్యకారులు బ్రాహ్మణముల సహాయముతో వివరించియుండిరి.

దీనిని (Butea Frondosa) యెందులకు దీసికొనిరో

మనము ముందు విచారించవలెను. బ్రాహ్మణములో "దేవో వై......అవరుంధి" (1-1-4) అని యుండెను. "బుద్ధిమంతు లొకానొక కాలమున నీవృక్షముక్రింద బ్రహ్మనుగూర్చియుచ్చ టించిరి" యని దీనియర్థము. అది దానినాలకించెను. ఈవృక్ష ము నుపయోగించువారు బ్రహ్మ వర్చస్సును బడయుదురు. మానవుని హృదయఫలకములో పలువిషయ సంసర్గము బాగుగ నాటుకొనును. పాలాశయనునది వృక్షము. దానిక్రింద వివేకులు బ్రహ్మనుగూర్చి విచారణజేసిరని "పలాశ" వల్ల నార్యునకు స్ఫురణకు వచ్చుచున్నది. దానిచేతనే యతడును బ్రహ్మను గూర్చి చింతించును. మరియు పలాశ యన నేమొ బ్రాహ్మణములో చెప్పబడి యున్నది. "బ్రహ్మవై... అవకరోతి" యని బ్రాహ్మణమున చెప్పబడియున్నది. మైత్రే యబ్రాహ్మణమునందు "బ్రహ్మవైపార్పయీాచి" (4-1-1) యని కలదు. శతపథబ్రాహ్మణమునందు "తేవై...... పలాశేస్య (1-3-3-19) అని యున్నది. ఈ కడపడి వాక్య మునకు జూలియన్ ఎగ్గలింగ్ అను గొప్పపండితుడు తన శతపథబ్రాహ్మణముయొక్క భాషాంతరీకరణమున యీా విధముగా జెప్పియున్నాడు. "అవి పలాశమానివై యుండ వలెను. (Baba Froudasa) ఎందుచేతనన పలాశవృక్షము నిశ్చయముగా బ్రహ్మమైయున్నది. మరియు అగ్నికూడా బ్రహ్మమే. ఈ కారణమున యగ్నులు పలాశ (మోదుగ) బ్రమానతో జేయబడవలెను. బ్రహ్మమొక వృక్షముతో తగు

చుగా బోల్చబడుచుండుట నీవిధముగా జూపుచున్నాడు. శత
పథ బ్రాహ్మణములో పరబ్రహ్మము పలుమారు పలాశవృక్ష
ముతోడను "పలాశస్య పలాశం" అనునట్లు పలాశపర్ణము
(మోదుగుఆకు) తోడను బోల్చబడి యున్నది. ఋగ్వేదములో
(10-31-7) "స్వర్గమర్త్యలోకములే కొయ్యనుండి చేయ
బడెను? యేచెట్టునుండి చేయబడెను? అనియు తైత్తిరీయ
బ్రాహ్మణమునందు (2-8-96) "బ్రహ్మదారు(కొయ్య)అనియు
అనగా స్వర్గమర్త్యములు చేయబడిన యీ వృక్షమే బ్రహ్మ
మనియు చెప్పబడియున్నది. అధర్వణ వేదమునందు(10-7-38)
పాదపమునకు శాఖవలె దేవతలా (స్కంబ్రహ్మ) బ్రహ్మానంద
రసముననుండి యుండెను. కాన బ్రహ్మను వృక్షముతో
బోల్చుట యసందర్భమని తలపకుడు. ఇక విద్యారణ్యు లెట్లు
వక్కాణించునో చూచెదము. అతడిట్లు జెప్పియున్నాడు.
"యచా...సుచ్యతే" "బ్రహ్మత్వేనాస్తుతిః" అని చెప్పుటచే
పలాశయాన బ్రహ్మ కన్వయించుచున్నది. ఇయ్యది రూపకా
లంకారము. దీనిని బాగుగా గ్రహించుటకు బ్రాహ్మణముల
యొక్క స్వభావము కొద్దిగా జెప్పవలెను. అయ్యది దరహాము
మీద విధి బ్రాహ్మణము అర్థవాద బ్రాహ్మణము అని
రెండు తరగతులుగా విభజింపబడినది. కర్మలెట్లాచరింపవలెనో
విధి బ్రాహ్మణముజూపును. కర్మయొక్క ప్రయోజనము అర్థ
వాద బ్రాహ్మణములో జెప్పబడును. అర్థవాద బ్రాహ్మణము
లోని యంతర్భాగములను గమనించ నగత్యము లేదు. ఆవిష

యము గావలసిన పూర్వమీమాంససూత్రములను జూడ వలయును. "తత్సిద్ధి" యనునది జైమిని పూర్వమీమాంసలో 1-వ అధ్యాయమున 4-వ పాదమున 23 సూత్రమై యున్నది. దానియర్థము మాధవకుంతేగారు "తస్య ఉద్దేశస్య సాధనం" అని చెప్పిరి. ఇది అర్థవాదము అర్థవాద మెప్పుడును పొగడుటను జెప్పదు. కొన్ని యర్థవాదములు స్తోత్రమును కొన్ని సాదృశ్యము మున్నగువాటిని సూచించును. ఈ సూత్రమునకు శబరాచార్యులు జెప్పినవిషయము ప్రశంసార్థము:—"యజమానః......భవతేతి"

తక్కిన సూత్రములను విరళించుటచే మీకాలము వ్యర్థమగును. శబరుని యభిప్రాయమున ప్రస్తారము యజమానుని సూచించునట్లే ఇక్కడ పలాశ బ్రహ్మను సూచించుచున్నది. కర్మార్థములో నుపమానము జూపెదను. జ్ఞానార్థమున ఉపమేయము గనుపరచెదను. వ్యాఖ్యానకర్తలు రెంటిని మిశ్రమము జేసిరి. నేను విడదీయుచున్నాను. పాలాశయను దానిరథకము మహీధరాచార్యులు బహుచక్కగ జెప్పియున్నాడు. "యోద్యపి......ఉక్తమ్" (9 పేజి)

"వై" యనుపదమునకు "బ్రహ్మ సంబంధము" అని విద్యారణ్యులు జెప్పుటచే పాలాశ అనగా బ్రహ్మము సూచించుచున్నది. ఎట్టి స్వల్పమైనదైనను మనకోర్కెల నీడేర్చుటకు నిర్జీవ పదార్థమగు పలాశను వేడుకొనుట నిష్ప్రయోజనమని మీరు తర్కించుటవలన లాభము లేదు. అటులైనచో బ్రహ్మ

వాదులయొక్కయు, మీమాంసకులయొక్కయు శ్రమమంతయు, వ్యర్థాయగును. కావున కర్మలయందు పలాశ నుపయోగించునపుడెల్ల బ్రహ్మను తలంపుడని నేను జేయువాదము సమంజసమైనది.

బ్రహ్మను పాలాశముగా జూడవలెననిగాని పాలాశమును బ్రహ్మనుగా జూడకూడదను ప్రతిశంక మరియొకటి కలదు. మహాత్ములైన బాదరాయుడు తన యమూల్యమైన బ్రహ్మసూత్రములచే నీ వాదమును ఖండించుచున్నాడు.

ఇక్కడ "బ్రహ్మవై పర్ణాః" యనియు "ఆదిత్యో బ్రహ్మ" ప్రాణోబ్రహ్మ యనియు కలదు. 4 వ అధ్యాయములో మొదటి పాదములో అయిదవ సూత్రము ప్రకారము యుత్తమమైన దానిని యంతరింపజేయవలెననియు బాదరాయణుడు (శుకుడు) నిరూపించియున్నాడు. "బ్రహ్మదృష్టిః ఉత్కర్షాత్" అని సూత్రము.

శంకరాచార్యులయొక్కయు తదితరులయొక్కయు వ్యాఖ్యానములు స్పష్టముగా నున్నవి. ఈ సూత్రప్రకారము పలాశయే బ్రహ్మగా జూడబడవలయునేగాని బ్రహ్మను పలాశగా జూడబడగూడదు. విద్యారణ్యు లీసూత్రమునకు భిన్నముగా వ్యాఖ్యానము చేసిరని జెప్పకూడదు.

ఇపుడు అనగా విద్యారణ్యులు "దేవాన్నరూపదధి" యని జెప్పియున్నారు. ఇచ్చట దదియనునది యుపమానముగా కర్మార్థములో నుపయోగించుచున్నాను. "దేవాన్నం" ఉపమే

యముగా జ్ఞానార్థములో జెప్పుచున్నాను. "రూప"యను పద మున యిచ్చట రూపకాలంకార ముపయోగింబడెనని తెలియు చున్నది. కావున "దేవాన్నం" అనగా "బ్రహ్మ"యని యర్థ మగుచున్నది. కార్మార్థములో "ఓపలాశా" యనియు "దధి యన" నీవు అనియగును. "దేవాన్నం దేవాహారం" కనుక "దేవాన్నం" అమృతమని తేలుచున్నది. అనగాజ్ఞానము. అనగా "బ్రహ్మవర్చః"యవి యన్నియు పర్యాయపదములు. వేదాంగ మును నిరుక్తభాగమైన వేదనిఘంటులో "ఇషమ్" బ్రహ్మ" "వర్చః" అనునవి "అన్నం"కు పర్యాయపదములుగా వాడ బడెను. (.. యాంధ్రీకరణము 245 పుట) ఈమంత్రమున క్రియా పదములేదు. కావున నెట్టర్థము జేసికొనవలెను. విద్యారణ్యు డెంతచక్కగా నీలోపమును బూరించుచున్నాడు.'అస్మిన్ మంత్రే వినియోగానుసారేణ చినద్మితిపాదమధ్య హృత్యవాక్యం పురాణీయం' అని చెప్పియున్నాడు. వినియోగమన్నను కర్మ యన్నను ఉపమానమే. ఉపమానమన "చినోద్మి" యనుపద మూహ్యమని మిక్కిలి జాగ్రత్తగా జెప్పుచున్నాడు. ఊరక నామాటనూహింపుడని చెప్పలేదు. వినియోగానుసారముగా దానికి విశేషణముగా నొప్పుచున్నది. అదెట్లు? మీరాతని యుద్దే శము గ్రహించితిరా ? విచారించిన మీరు గ్రహింపగలరు. ఒక లౌకికోపమానమును దీసికొందము. రూపకాలంకారముచే స్త్రీ యొక్క ముఖము చంద్రునితో బోల్పబడును. ఆమె ముఖ చంద్రుడు ఇక్కడే క్రియనుపయోగింపవలెను? ఇక్కడ చంద్రుని

కన్వయించు క్రియ నుపయోగించవలెను. కాని ముఖమున నుప యోగించు క్రియనుపయోగించరాదు. ఆమె ముఖచంద్రుడుదయించెను. ఉపమానమున ఉదయించెనను క్రియ యే యుక్తమైనది. ఉపమేయమున తదనుకూలమగు క్రియ నుపయోగించవలెను. కాని దీనినే యుపయోగింపరాదు. అశ్లీ కర్మయందు నగును. వినియోగమందు "అచినాద్మి" యని ప్రయోగించవచ్చునుకాని ఉపమేయందుకూడదు. కావున "సమీపించు" లేక "వేడుకొను" అననది తగినపదమైయుండును. "(ఓదైవమా అమృతము లేక జ్ఞానముకొరకే నిన్ను సమీపించుచున్నాను. లేక వేడుకొనుచున్నాను." అని జ్ఞానార్థమందుండును. కర్మార్థమందు "ఓపలాశా" దధికొరకు నిన్ను (కోరుచున్నాను.) ఈయనువాకమును ద్విజులెల్లరు బ్రహ్మయజ్ఞమున నుపయోగించుచున్నారు. అప్పుడు పాలాశము (మోదుగ) నుపయోగించుటలేదు. బ్రహ్మయజ్ఞమందు దానిని జదువుట తప్ప వేరేమియు వినియోగములేదు. కావున దాని యర్థమిప్పుడేమైయుండునో కనుగొనుడు. బ్రహ్మయజ్ఞమందు "ఓపాలాశశాఖా" నిన్ను నేను కోయుచున్నాను అని చెప్పనొప్పదుగదా.

రెండవమంత్రమును విచారింతము. ఆమంత్రము "ఊర్జేత్వా "త్వా" యన మొదటి మంత్రములో జెప్పిన దానికంటె విశేషము జెప్ప నవసరములేదు. "ఊర్జ" యనగా "బలము" ఉపమానోపమేయములలో నొకేయర్థము గలిగియున్నది. ఈరెండు మంత్రముల నుచ్చరించుటవలన ఫలితమేమన "ఇషం

......దదాతి" ఈయనువాకము అధ్వర్యకాండలోని భాగము. యజమాని యొక్క (యజ్ఞకర్త) ఐహికాముష్మికములగు ఆహార బలములకొరకు అధ్వర్యు డీమంత్రముల నుచ్చరించి ప్రార్థించును. ఇటుల ప్రార్థించిన పిమ్మట మూడవ మంత్రము జదువును. దీని నుపక్రమించకముందు మైత్రాయణీశాఖ యీశాఖవలె నుండక "ఇషేత్వా సుబ్భూతయా" అని చెప్పు చున్నదని విన్నవించవలసియున్నది. జ్ఞానసుఖజీవనముల కొరకని దాని యర్థము.

మూడవమంత్ర మిప్పుడు విచారించెదము. "వాయవస్థో పాయవస్థ" యనమని శాఖచెప్పుచున్నది. మైత్రాయణులును వాజసనేయినులును ఉపయవస్థను లోపింపజేసెదరు. ప్రస్తుతము తైత్తిరీయ శాఖను గురించి మాత్రము మాట్లాడు చుండుటచే మంత్రముయొక్క చివర భాగమును లోపింపజేయుటకు కారణము గమనింప నగత్యము లేదు. విద్యారణ్యస్వామి రెండు విధములుగా నన్వయించుచున్నాడు. అందు రెండవ విధము "అథవా......సమర్పయతి" దయానందస్వామి "సర్వ... ప్రాణాదయః" అని చెప్పుచున్నాడు.

ఈవాక్యములవల్ల "ప్రాణః" అన "వాచః"కు బోల్చ లేననియు నీశ్వరు నాశ్రయించెననియు తెలియక మానదు. "వాయవః" "పశవః" ఉపమేయోపమానములుగా వాడబడ లేదను శంక కలిగినచో మహీధరాచార్యునియొక్క యీక్రింది వాఖ్యానమును జూడుడు. "వాయురూపోత్వం...అవర్తతే"

[3వ పేజి) అని చెప్పియున్నాడు.

పురోహితు డీమంత్రము జదివిన వెనుక "పయస్వతే" "అగ్నేవ్రతపతే" యను రెండుమంత్రములను యజ్ఞకర్త యుచ్చరించును. (నాతర్జుమాలో 244-248 పేజేలలో వివరింపబడినది.) ఈ యనువాకమును వ్యాఖ్యానమొనర్చుట కీమంత్రద్వయముయొక్క యర్థము మిక్కిలి యావసరము. ఎటువంటి గొప్పసత్యమును బోధింపబడెనో నిష్పక్షపాతబుద్ధితో విచారింపవలెను. వేదభావము కర్తయేయని మీరు తలంచినయెడల అధ్వర్యు డీకర్మను ప్రారంభించి పలాశమును గోసి యావులనుండి దూడలను తోలినవెనుక యజమానిచే పైమంత్రముల నేల యుచ్చరింపబడవలెను? ఓయధ్యక్షా!ప్రతి కార్యమునకు ముందు ఆచమించవలయునని మీకు తెలిసియున్నది. ఆపస్తంబుడు "పయస్వతి" యను మంత్రమును గురించి "బయసతి......స్పృశతివ" (శ్రౌతసూత్ర 4-2-3) అని చెప్పియున్నాడు.

శుక్ల యజుర్వేదు లీమంత్రము నుపయోగించలేదు. అగ్నే వ్రతపతే మాత్రమే వారుపయోగింతురు. వ్రతముపై తే సూత్రమై యున్నది. (కాత్యాయన 4-2-3)

ఈమంత్రము జెప్పుచు వ్రతముగాని కర్మగాని ప్రారంభింపవలెను. అగ్నే వ్రతపతే యను మంత్ర ముచ్చరించునపు డేమిచేయుటకును ఆమంత్రార్థము తేటతెల్లమే. "ప్రమాణములకు ప్రభువైన దైవమా! నేను ప్రమాణమొనర్ప మొదలిడు

చున్నాను అని దీనిభావము. వెనుకటి కర్మభావమునకును ఉచ్చరించు మంత్రముల వరుసకును సంబంధము లేకయున్నది. జ్ఞానయజ్ఞభావమునిదియు నేకీభవించుచున్నది. మొదటి రెండు మంత్రములచేతను కర్తనుదీవించుటకే పురోహితుడు దైవమును వేడుచున్నాడు. ఆయజమానుడు తన "ప్రాణాదినయనము" ను యీశ్వరునకు సమర్పింప నాజ్ఞాపింపబడుచున్నాడు. అనగా చిత్తమును తదేకనిష్ఠగా దైవమునం దుంచవలసియున్నది. ఇదియే నిజమైన యోగము. పతంజలి యోగమున "యోగాః చిత్తవృత్తి విరోధిః" అని వర్ణించియున్నారు. వేదము యొక్క ముఖ్యోద్దేశ్యము. రాజయోగమును బోధించుటేయని తోచుచున్నది. మూడవ మంత్రము మనుజుడు తనప్రాణము లను మనోభావము లన్నిటితోడను స్వాధీనపరచుకొనవలె నని సంబోధించుచున్నది. అంతమానవుడు ప్రథమ మంత్ర మును "పయస్వతి" అనగా నేను బ్రహ్మవర్చస్సుతో నిండిన వాడనగుదునుగాక అని చెప్పి రెండవమంత్రమున ప్రమాణ మొనర్చెదనని చెప్పుచున్నాడు. ఒక్కింతకాలములోనే అగ్నే వ్రతపతేయను మంత్రార్థమును విశదీకరించెదను. అంతకు పూర్వము బ్రాహ్మణమును విద్యారణ్యముకూడా ప్రాణములు వాచలు అనునవి రూపక ఉపమానముగా నుపయోగించబడి నదనివక్కాణించుచున్నదని చెప్పుచున్నాను. బ్రాహ్మణమున ప్రవా......వాయువస్తేతి అనియున్నది. భాష్యమున అథ్వ ర్యుః......కరోతి అని యున్నది. కనుక జ్ఞానవిషయమున

"వాయవస్థ" అనియు కర్మవిషయమున దూడలని యుపయో
గింతురు. ఈ యుపమానమిదేరీతిగ నెట్లు వచ్చుచున్నదో
గమనింపుడు.

ఇప్పుడు నాలవమంత్రమునుగురించి విచారింతము. అది
"దేవోవస్సవితాప్రార్పయతు" అయియున్నది. ఇది పెక్కు-సంశ
యములను నివృత్తిజేయు ముఖ్యమంత్రమై యున్నది. విద్యార
ణ్యులు తైత్తిరీయ సంహితభాష్యముయొక్క- యుపోద్ఘాతమున
"బ్రాహ్మణానుసారేణమంత్రార్థయోజయామిః" అని
చెప్పియున్నాడు. (తెలుగు ప్రతిపుట 10) మంత్రముయొక్క-
అర్థము బ్రాహ్మణము ననుసరించి చెప్పవలసియున్నది. ఈమం
త్రబ్రాహ్మణము "దేవ......తస్మాదేవ మాహుః" అయి
యున్నదీ (3-1-1)

మైత్రేయ బ్రాహ్మణమున "దేవోవస్సవిత ......
ప్రార్పయతి" అనియున్నది. (4-1-1) శతపథబ్రాహ్మణమున
"దేవోవస్సవితా ప్రాప్రయత్వితి......శ్రేష్ఠతమాయ కర్మ
ణైతి" అని స్పష్టముగనున్నది. (1-7-1-4) "దేవోవస్సవిత"
అనుమంత్రమున సవితాయనగా జ్ఞానులను ప్రేరేపించువాడని
యర్థము. దైవముచే ప్రేరేపింపబడి జ్ఞాని యజ్ఞమును ప్రారం
భించుచున్నాడు. కనుకనే దైవమునిన్ను ప్రేరేపించుగాతయని
జెప్పుచున్నాడు. "శ్రేష్ఠతమాయకర్మ" అనుచోయజ్ఞమని యర్థ
ము. ఈయజ్ఞముమాత్రమే అన్నిటిలో నుత్తమమైన కర్మమై
యున్నది. ఉత్తమోత్తమమని చెప్పుటకు వలనుపడదుగాని "శ్రే

ప్తమాయు” యనుపదమునకు రెండు తమప్రత్యయములుం డుటంజేసి అట్లు జెప్పుచున్నాను. ఈయజ్ఞము దేవతారాధనమై యున్నది. కనుక నేయది మహాప్రఖ్యాతకార్యమని యెంచబడు చున్నది. బ్రాహ్మణములనుండి యీమంత్రమునకేమి అర్థము జెప్పవచ్చును? బ్రాహ్మణానుసారముగా మంత్రార్థములను గ్రహించవలెనన్న విద్యారణ్యస్వామి బోధించిన స్వరసూత్రము నతిక్రమింపకుడు. బ్రాహ్మణముల ననుసరించి విద్యారణ్యులు దేవసవితఃఅనుదానికి “ప్రేరకో దేవః అంతర్యామిపగమేశ్వరః” అనియర్థముజెప్పియున్నారు. సవిత యనుదానికి సూర్యుడని తలంపకుడు. ఈ గొప్పతర్కశాస్త్రజ్ఞునివలన జెప్పబడినయ ర్థమును గ్రహించుడు. సూర్యసిద్ధాంతమునకూడా సవితి యన దేవుడని యర్థమున్నట్లు నిరూపించెదను. సవితయనుపద మునకు దేవుడనియర్థము నిర్ధారణజేసితిమి. కనుక మిగిలినమం త్రమునుగురించి విమర్శింతము.

వః అనగా నర్థమేమి? శతపథ బ్రాహ్మణమున సవిత అనగా “దేవానాం ప్రసవిత” అని చెప్పబడి యున్నది. అనగా జ్ఞానులను సృష్టించినవాడని యర్థము. వః అనగా జ్ఞానులని యర్థమైయుండవలెను. కర్మభాగమునందలి యుపమానాను సారము విద్యారణ్యస్వామి మానవులను సూచించుటకై గోవు లని వ్రాసియున్నాడు. కావుననే కర్మార్థమునందు వః అనగా గోవులని చెప్పియుండగా విశేషార్థమునందు మానవులని జెప్పి యున్నాను. పిమ్మట పదము ప్రార్పయతి అయియున్నది. దీనికి

తర్క మనవసరము. కర్మార్థమునందును శేషార్థమందును "ప్రేరణ" అని సూచింపబడినది. చివరపదము "శ్రేష్ఠతమాయకర్మ" కర్మార్థమునందు దింద్రియ దధిరూపము కర్మణే అరణ్యే ఘాసమిత్నం అను ఉపమానము ననుసరింపవలసి యున్నది. అనగా నమృత సంపాదనార్థము సత్కర్మలను జేయవలయును.

తదుపరి మంత్రమునుగురించి విచారించుటకు పూర్వము వేరొక విషయము మాట్లాడనిండు. మన హైందవుల నిరు తెగలుగ విభజింపవచ్చును. వేదముయొక్క అపౌరుషేయత్వము నందు నమ్మికగలవారొక తెగ. పౌరుషేయత్వమునందు నమ్మిక గలవారు రెండవ తెగ.

మొదటి తెగవారికి వేదముయొక్క శ్రేష్ఠత్వము నిరూపింప నగత్యములేదు. వేదము మానవనిర్మితమని తలంచు వారికి జెప్పుచున్నాను. మానవుడు క్రమాభివృద్ధి గాంచెననుట లో నే నేకీభవించుచున్నాను. మానవుడు ప్రారంభమున సృష్ట్యారాధన మొనర్చి పిమ్మట సృష్టికర్త నారాధించెనని యంగీకరించెద. అచేతనము నారాధించినపిమ్మట చేతనము నారాధించెను. ఈమంత్రము మనపూర్వులు సృష్ట్యారాధన జేయు నజ్ఞానావస్థను గడచిరని నిరూపించుచున్నది. ఈ మంత్రమున సృష్టికర్తయే పూజింపబడుచున్నాడు. కాని సృష్టి పూజింపబడుటలేదు. దైవమును చెందియున్న యీ మంత్రమును మనఋషులు సృష్టికర్తయొక్క తత్వము గ్రహింపగలి

గినపిమ్మటనే దీని వ్రాసిరనియు మీరు విశ్వసించినయెడల ప్రథమ మంత్రమున (జడ) అచేతని పదార్థమొకటి పూజింపబడుచున్నదని న్యాయముగా తర్కింపజాలరు. ఆ సందర్భమున నీమంత్రములు వ్రాయబడినవి యని మీకు తెలియునిమాట నిజమే. అది యేకారణంబున నుత్పత్తియైనది కనుగొనుట కాధారంబులులేవు. ఈ మంత్రములీ ప్రకారము వ్యాసునిచే వ్రాయబడినవని నే నొప్పుకొనియెదను. (ఇందుకు నాచే బ్రచురింపబడిన తైత్తిరీయ సంహిత యొక్క యుపోద్ఘాతమునుజూడుడు.) కర్మాచరణముకొరకవి ప్రత్యేకముగా నీవిధమున నమర్పబడినవి. మానవుడు క్రమక్రమముగా సత్యస్వరూపమును గ్రహింపగలుగుటకై యిట్లమర్పబడినవి. బహిరంగముగా నాచరించు కర్మమూలమున జ్ఞానబోధ కలుగుటకై వ్రాయబడియున్నది. కర్మాచరణము యొక్క అంతరార్థము గ్రహించుట కష్టమేయైనను మనము బహిరంగముగా నాచరించువానిని అంతరంగంబునకూడా నాచరించినయెడల మనము దానిని గ్రహింపవచ్చును. దీనికిదియే మార్గము. బ్రహ్మాండమున మనకు గోచరించుదానిని పిండాండమున నూహించవలయును. ఈభావము నుపదేశించుటకే వ్యాసునిచే వేదమిట్లమర్పబడి యున్నది. తత్పూర్వపు సంగతులు మనకు తెలియవు. ఎవరైన తత్పూర్వపుస్థితిని గ్రహించి యీ మంత్రంబులనెల్ల క్రమప్రకారము వ్రాసినయెడల మిగులనుపయోగకరముగ నుండును. కాని యవి చాలదుర్లభము,

వ్యాసునిచే గల్పించబడిన పద్ధతి ననుసరించి వేదముయొక్క అర్థమును విశదీకరించుట మాత్రమే నే పూనుకొనియున్నాను. కనుక నీమంత్రంబుననున్న దేవో వస్సవితా॰ అనుపదము జడో పాసన కన్నివిధంబులను వ్యతిరిక్తముగా నున్నదని చెప్పనక్క అలేదు.

మరియొక యంశమును సూచించుచున్నాను. ప్రజలు పద్యములను వ్రాయుట నేర్పునప్పటికి జ్ఞానావృభిద్ధిని గాంచిరని యొప్పుకొనక తప్పదు. ఇచ్చటమాత్రము యజుస్ కాదుగాని ఋుక్ అయియున్నది. అది వచనము కాదు గాని పద్యమైయు న్నది. అది ఋుక్ అనుటకు మీరు సంశయింప వచ్చును భట్టభాస్కరుడు "ప్రథమయాసవితారం అభ్యర్థ్యతియాంకవి పదావిరాట్ గాయతి" అని చెప్పియున్నాడు. ఈ తర్క శాస్త్రజ్ఞుని యభిప్రాయముతో మీరు తృప్తి జెందకపోవచ్చును. విద్యారణ్యులు (దేవో వస్సవితా ప్రార్థయత్వితి ద్విపరా విరాట్ గాయితి 216 పేజి) అని చెప్పియున్నారు. ఇప్పు డైనను దీని ఋుక్ అని మీరొప్పుకొనకతప్పదు. ఇది మన పూర్వులు విద్యాభివృద్ధిగాంచిన తరువాతనే యీ మంత్రి మును వ్రాసిరని సూచించుచున్నది.

మతవిషయములం దభివృద్ధిగాంచిరని నే నిదివరకే నిరూపించియున్నాను. అట్టి మనుజులే కర్మశేషమని యం దురు. దధిదాన ముత్కృష్టమైనదని తలంతురా? అటులకాదు. అదియొక యుదాహరణము మాత్రమే అయియున్నది. నేనుద

హరించిన నాల్గుమంత్రంబులను చదివి వాటి గూఢార్థమును గ్రహింపుడు. పలాశగాని గోవత్సములుగాని ధేనువులుగాని వానియందు సూచింపబడలేదు. నిష్పక్షపాతబుద్ధితో నాలోచించి చూడుడు. యీమంత్రముల విషయమై మీమనసు నందెట్టి యుద్దేశములు పొడమునో చూడుడు. ఇది మీకును నాకు జరుగు తర్కముగాదు. దైవమునకును ప్రపంచమున ప్రతిమానవునకును సంబంధించినదై యున్నది. విద్యాబల తర్కమువలన నొకడుమరియొకని నోడింప ప్రయత్నించుట కిది ఐహిక సంబంధమైనదికాదు. కేవలము మతసంబంధము తృణీకరించక జాగ్రత్తగా నాలోచింపుడు. బ్రహ్మయజ్ఞమునం దీమంత్రముల నుచ్చరించెదరు. అవి మీసమయమునం దెట్టి యర్థమిచ్చునో చూడుడు. మనడెందముల నపుడెట్టి యభిప్రాయమును గలిగించునో యదియే విశేషార్థము. అదియె గూఢార్థము. అదియె యథార్థము.

ప్రాక్పండితుడైన కోల్ బ్రూక్ వ్రాసిన మొదటి మంత్రముయొక్క భాషాంతరీకరణము గనుగొనుడు. మొదటి భాగము 142 పుటలో యజుర్వేదోపన్యాస ప్రారంభమున "ఓవేదశాఖా! వర్షముకొరకు నేను నిన్ను ప్రోవుచేయుచున్నాను." అని చెప్పియున్నాడు. పలాశ శాఖయని చెప్పియుండలేదు.

"ఆప్యాయధ్వమఘ్నియా దేవభాగం" అనునది తదుపరి మంత్రమైయున్నది. ఇచ్చట "అఘ్నియః" అను పదముయొక్క

అర్థమును గ్రహించుటెంత కష్టతరమో చూడుడు. సత్యమును పరిశోధించుట మన విధియైయున్నది. కనక నీవిషయ మెంత శ్రమమైనను పడవలసియున్నది. ఇది సంబోధ నార్థకపదము. ఇదొక ప్రారంభమున నుండుటచే దీనికి స్వరము (all out) లేదు. "అనుదాత్తన్ సర్వమపాదదో అమంత్రతాస్యచ" పాణిని (8-1-18-19) అను సూత్రము ననుసరించి నిఘాటమన గానిది స్వరము అనుదాత్తముఅయియున్నది. ప్రాతిపదికఅఘ్ని యాయనునది వేదమందున "అఘ్నియ" మైయున్నది. దీని కాది ఉదాత్తం అంతోదాత్తం అని వేరువిధముగా స్వరము వేయబడియున్నది. ప్రథమ సందర్భమున నెల్లప్పుడిది గోవులని యర్థమిచ్చును. రెండవసందర్భమున ప్రజాపతియనియర్థమిచ్చును. వేదమందెన్ని స్థలములందు పద ముపయోగింపబడినది విచారించు టవసరము. కాని ఋగ్వేదమందిది గోవులను అర్థముతో గాక వేరొకయర్థము వచ్చునట్లుపయోగింపబడినది. సాయన ననుసరించి యీస్థలమునందిది"జయింపబడనిది" అనియర్థమొసంగును. ఈ మంత్రము ఉద్వఊర్మిస్సయ యాయి యున్నది. (ఋగ్వేదము 3-33-13)

"అఘ్నియా వఘ్నియేన కేనాపి దిరస్కారణీయే" అని యర్థము చెప్పబడి యున్నది. ఉనాదిసూత్రమున నీవాక్యము నకు "అఘ్నియాదాయశ్చ" అనియున్నది. యగంతా ఆమిని పాత్యం హం తేర్యక్ ఆదాగమోపధలోపన్అఘ్నెఃప్రజాపతిః" అని యజ్వలదత్తుడు పైసూత్రమున కర్థము జెప్పియున్నాడు.

ప్రజాపతియన బ్రహ్మయనియే యర్థముకాదు. సద్గుణములు కలవాడని అర్థమొసగవచ్చును. (ఇదివరకు సూచించిన శంకరభాష్యమును జూడుడు) అఘ్నియ అనుపదమునకు గోవనియు మనుజులనియు రెండర్థములు గలవు. ప్రథమార్థమందు ప్రథమాక్షరముపై స్వరమీయవలెను. ద్వితీయార్థమందు అంత్యాక్షరముపై స్వరమీయవలెను. రెంటికిని సంబోధనస్వర ముదాత్తముతో సహా "అఘ్నియః" యైయున్నది. కనుక నీమంత్రమునందలి యీపదమునకు ఓగోవులారా! ఓ మనుజులారా! అనియర్థము జెప్పవచ్చును. మొదటిది కర్మార్థము. రెండవది విశేషార్థము. సామాన్యముగా నీపదము అజేయమైనది అని యర్థమిచ్చును. ఓఅజేయులారా! లేక అగోచరులారా! ఇంద్రునియొక్క భాగమునువృద్ధిజేయుడు. అని యొకపాశ్చాత్యపండితుడు ఈమంత్రమున కర్థముజెప్పి యున్నాడు. (Sacred books of the East vol XII, page 185)

"ఆప్యాయధ్వం"అను క్రియకు విద్యారణ్యస్వామి ప్రవిధంకురు అనియర్థము జెప్పియున్నాడు. దేనిని కురు అనినాడు? దేవభాగం అనియుత్తరము. భాగం అనగా సామాన్యార్థము విశదమే. విద్యారణ్యస్వామి 22 వ పుటయందు "వైదిక పదార్థాః లౌకికాభ్యాం భిన్నా" అని వ్రాసి యున్నాడు. వేద వాక్యములకు లౌకికార్థమును జెప్పినయెడల వానియందలి యథార్థము గ్రహింపలేము. భాగం అనగా వేదమునం దెట్టి యర్థము చెప్పబడియున్నదో చూచెదము. తర్కశాస్త్రజ్ఞుడి

వాక్యార్థమును మంత్రమునందు జెప్పియుండలేదు. "భాగం" అను పదమున కెచ్చోట నర్థము వివరించి యున్నాడో కను గొనియెదము. 7 వ మండలము లేక 5 వ అష్టకమునకు చెందిన ఋగ్వేదముయొక్క ఒక ఖిల్లామైన సర్పసూక్తమున "త్రిస్త్వాంజుహోూర్మా తులస్యయోషా భాగస్తేపైతురిష్వా సెనె యీా మసామివ" అనియున్నది.

ఈ ఋక్కుయొక్క భాష్యమునందు "యథామా తులస్యయోషా దాహితా దాహిత్రిస్యభాగః భజనేయా భాగి నేయే నీపరిణీతం యోగ్యేత్యర్థః" అని యున్నది. (తెలుగు పరాశర మాధవీయం 109 పుట) పదము భాగ=సేవాయాం అను దానినుండి వ్యుత్పత్తియైనది. కనుక దేవభాగం అనగా దేవతాసేవయని యర్థము. ఈ ప్రపాఠకమునందే పంచమాను వాకమున రాక్షసభాగం అను వాక్యమునకును దీనికిని తార తమ్యము చూపబడియున్నది. మానవునియం దెల్లపుడును సద్గుణ దుర్గుణములకు పోరాటము జరుగుచుండును. ఈ విష యము శంకరాచార్యునిచే విపులముగ బోధింపబడియున్నది. ఇందు సద్గుణములు దేవభాగమును దుర్గుణములు రాక్షసభాగ మునై యున్నది, "ఓ గోగణములుగల మనుజులారా! దైవ సేవ జేయుటయందే ప్రమత్తులరై యుండుడు. అని మంత్రా ర్థము. అనగా నెల్లపుడును సత్కార్యములను సల్పుడని యర్థము. ఆంగ్లేయమున గాడ్ అను పదము గుడ్ అను పదమునుండి వ్యుత్పత్తి అయినదని మీాకు తెలిసిన విషయమే.

మనము కర్మనాచరించు క్రమమునుగూర్చి యాలో చింతము. ఈక్రమము వేదముయొక్క నిజమైన యర్థమును కనుగొనుటలో మనకు చాల సహాయకారి యగును. తైత్తిరీయ సంహితను కాండఋషుల సంఖ్య ననుసరించి "ప్రజాపతి సామః అగ్నిఃవిశ్వేదేవః" అను నాలుగు భాగములుగ లేక మండలములుగ విభజింపవచ్చును. ప్రస్తుతము మనము ప్రజాపతి మండలమును గురించి విచారింపవలసియున్నది. ఇది అధ్వర యాజమాన, అని రెండు భాగములుగ విభజింపబడినది. ప్రథమకాండమునందలి 5వ ప్రపాఠకమున 10 అనువాకములో 2వ పనసయందు ప్రజాపతి మొదలు 6వ ప్రపాఠకమునందలి 6వ యనువాకాంతమువరకుగల మంత్రము యాజమానమై యున్నది. 5వ ప్రపాఠకమునందలి అంతిమానువాక మిందులో చేరినదే.

ఈ యిరువది అనువాకముల బోధనుగూర్చి విపులముగా నుపన్యసించుట కిపు డవకాశములేదు. అధ్వర్యుడు మొదటి యనువాకమునందలి 1-2-3 మంత్రములను చెప్పిన పిమ్మట యజమాని "పయస్యతి అగ్నే వ్రతపతే" యను రెండు మంత్రముల నుచ్చరించును. ఈరెండు మంత్రముల యొక్క యర్థము. నేవ్రాసిన వేదముయొక్క భాషాంతరీకరణమునందు 244-218 పుటలలో చూడనగును. యజ్ఞకర్త యేక్రతువైనను ప్రారంభించుటకు ముందీమంత్రముల నుచ్చరింపవలసి యున్నట్లు దానివలన గ్రహింపనగును. ఇది సాధారణముగా సంకల్పమని

వాడబడుచున్నది. శుక్లయజుర్వేదానుసార మీమంత్ర ముప యోగింపబడుటలేదు. "అగ్నేవ్రతపతే" యను మంత్రమొకటి మాత్రమిం దుపయోగింపబడినది. కర్మార్థానుసారము పురోహితుడొక శాఖను ఖండించి దాని శుభ్రము జేసి యీమూడుమంత్రముల పఠించును. ఆవులనుండి దూడలను విడదీయును. యజమానుడంత తన రెండు మంత్రముల బఠించును. కర్త ప్రారంభ మంత్రములను కర్మ ప్రారంభించబడి కొంతచేసిన పిమ్మట బఠించు నట్లేర్పరచియుండుట కేమిహేతువు చెప్పగలము. తర్కశాస్త్రజ్ఞుడైన కాత్యాయను డీయస్థిరభావమును గ్రహించి దాని కొక విధమున నర్థము చెప్పవలయునని ప్రయత్నించెను. వాజసనేయాచరణము విషయమై యిపుడు తర్కమనవసరము. తైత్తిరీయాచరణమును మనమిపుడు విచారించవలసియున్నది. కర్మయొక్క నిజోద్దేశమును గ్రహించినయెడల నీబహిర్గోచరంబగు యస్థిరభావమంతరించును. "ఇషేత్వా, ఊర్జేత్వా" అను రెండుమంత్రములచేతను పురోహితుడు యజమాని దీపించుటకై దైవమును ప్రార్థించును. బ్రాహ్మణభాష్యమీమంత్రములకు ఈశమ్ ఊర్జం యజమానేదదాతి అని చెప్పి యజమాని తదేకనిష్ఠతో దైవధ్యానమొనర్చుటవల్ల యజ్ఞమున కుపక్రమింపుమని బోధించుచున్నది. దైవధ్యాన మొనర్చుటనగా దూడలను గోవులనుండి తొలగించినటులనే తన ప్రాణములను ప్రాపంచిక బంధములనుండి మరలించి దైవచింతనయందే యుంచుట. ప్రాణాయామమిదియె. మనము నిత్యము

సంధ్యయం దాచరింప బ్రయత్నించు ప్రాణాయామమిదియే. అట్లు సంబోధించిన పిమ్మట కర్త యజ్ఞమును ప్రారంభించును. "పయస్యతే" అను ప్రథమమంత్రమున తనకు బ్రహ్మవర్చస్సును బ్రసాదింపుమనియు "అగ్నే వ్రతపతే" అను ద్వితీయ మంత్రమున తనకు వ్రతమొనరించ సమర్థత నొసంగుమనియు ప్రార్థించుచున్నాడు. దీన వ్రితం అను పదమున కర్థమేమో విచారింతము. వ్రతమనగా సామాన్యముగా మన మాచరించుచున్న ట్లుపవసంచుటయు సమారాధన లొనరించుటయు కాదు. వేదమునందు వ్రతం అను పదము గంభీరభావముతో నుపయోగింపబడినది. శతపథశ్రుతి "ద్వయం వైదం నతృతీయమస్థి సంత్యంచైవానృతం సత్యమేవ దేవా అనృతం మనుష్యాయిద మహమనృతాత్స త్యముపైమితి తన్మానుషేభ్యో దేవానుపైతి సవైసత్యమెవ వదేత్, ఏతధవై దేవావ్రతం చమరత్ యత్సత్యం తస్మాతే యశోయశో హాభవతి ఏవం విద్వాన్ త్సత్యం వదతి 1-1-1-4-5"

మనుజులమైన మనము స్వతస్సిద్ధముగా అసత్యమయమైయున్నామనియు దానివిడచి సత్యమున బ్రవేశింపవలయుననియు వ్రతమనగా సత్యమునే పలుకుచు దాని నాచరించుటయని దీనియర్థము. విద్యారణ్యస్వామికి పూర్వమున గొప్ప శాస్త్రజ్ఞుడైన భట్ట భాస్కరాచార్యులు యీ మంత్రమునకు భాష్యము వ్రాయునపుడు అగ్నేయను పదమునకు "బ్రహ్మచర్యసత్యాదీనాం వ్రతపాలక" అని చెప్పియున్నాడు. అనగా

మనకు బ్రహ్మచర్య సత్యాది సహితముగా వ్రతము నాచరింప వలసి యున్నదని యర్థము. మన పూర్వులు సత్యవాక్పాలకులును తత్ శ్రద్ధాళులునై యున్నారు. సత్యమునిన మన పూర్వులకున్న భక్తి మనకు లేకుండుట విచారకరము. మన మును వారి ననుసరించి ప్రయత్నింప వలసియున్నది. సత్యమే మన యాదర్శమై యుండవలెను. భాగవతమునగల "వారిజాక్షులందు" అను పద్యము మన మనంబుల నాకర్షించుటయు దానికి మన మపార్థముల గల్పించి పాపపరులమగుటయు విచారకరము. దీని నాధారముగా గొనదగినదికాదు. కీర్తి వంతుడైన బలిచక్రవర్తిని బరీక్షించుటకై అది యుపయోగింపడబడినది. ఈపద్యభావ మతడు వదలి పరీక్షావిజయుడయ్యెను. మనమా భావమట్లె నిరసించి ప్రఖ్యాతిజెందవలసియున్నది.

ఈమంత్రంబుల కర్తబఠించి వ్రతము నాచరించెదనని ప్రమాణమొనరించినమీదట పురోహితుడు "దేవోవస్సవితా" అనునాలవమంత్రమున నాతడసత్యమునువీడి సత్యమార్గమునవలంబించి దైవచింతన గలవాడైయుండునట్లు సాయము జేయుమని ఈశ్వరు ప్రార్థించును. యీతీరుననే కర్మక్రమంబును మంత్రముయొక్క యదార్థమునుగూడ యుత్కృష్టమైన అంతరార్థమొకటి యున్నదని సూచించుచున్నది. ఈ యంతరార్థమును గ్రహించుటకు బ్రాహ్మణమును వేదాంగములలో నొకటియైన నిరుక్తమును ముఖ్యమైన సహాయభూతములు యజ్ఞగీతములకు సూత్రములకును యాగకర్మకును గల

పరస్పర సంబంధమును యీచిహ్నములు సూచించుచున్నవి. Muirs Texts, Vol III page 1 లో మన మధ్యోగతిపాలు జేసిన యీ చిహ్నములయొక్క సంబంధమునే మీకు నివేదించుచున్నాను. (మూరుటెక్స్టు 3 వాల్యుం 1 పుట బ్రాహ్మణములను యీదిగువరీతిగా వర్ణించియున్నాడు. బ్రాహ్మణములే మంత్రములయొక్క మిశ్రితములై యుండి కర్మభాగముమందు వాటిప్రయోగము స్పష్టపరచుచు శ్రుతుపుయొక్క వివిధభాగముల దెలుపుచు సర్వతంతులయొక్క మూలమును గూఢార్థమును బోధించును. మనమీ తంతుయొక్క గూఢార్థమునే గ్రహించవలసినది.

డాక్టరు హాగ్ యీవిధముగా జెప్పుచున్నాడు. "బ్రాహ్మణములనగా మంత్రములయొక్క అర్థమును గురించి మిగుల యూహాపోహాలతో గూడి వాని ప్రయోగములను గురించి నిర్ణయముల దెలుపుచు వాటియంతరార్థమును బోధించినట్టి వేదభాగమని గ్రహించవలయును. (Intro to the transla-tion of Aitareya Brahmana. మిమ్ములను పరిశోధించమని వేడుకొనినది యీగూడార్థములకొరకే. ఇంతకంటె యెక్కువప్రమాణముల జూపుటయవసరము. భారతీయవిజ్ఞానులెల్ల రేకగ్రీవముగా బ్రాహ్మణములనగా కర్మయొక్క గూఢార్థముల దెలుపునవియని జెప్పియున్నపుడు ఎవరైన మారువలుకగలరా? మన హిందూవ్యాఖ్యాతలకు నీవిషయమున భేదాభిప్రాయమున్నదని దలచుచున్నారా? లేదు.

ఈ విషయమునే యీప్రపాఠకముయొక్క 3వ అను వాకములో "వసూనాం" అను 3-వ మంత్రమునకు విద్యారణ్యభాష్యమున చెప్పబడియున్నది. నాభాషాంతరీకరణము యొక్క 36 పేజీలో చూడవలయును. విద్యారణ్య భాష్యము నందిది ఎడారిమధ్యంబున గాననగు రమ్యవన ప్రదేశమువంటిది. అట్టి ప్రదేశములకొంతకు వెతకుడు. విద్యారణ్యస్వామి అది సాదృశ్యమని చెప్పినయెడల మీరుకొందరు పోరాడవచ్చును. కానియాతడట్లు దృఢముగా జెప్పనియెడల నట్లుపోరాడరు.ఆయన యట్లే చెప్పియున్నాడు. ఈవివాదమునందింత మోసమున్నదని చెప్పుచున్నాడు. ఒక యాకృతియొక్క అంగముల కొన్నిటి కర్థముండిన మిగిలిన వాటికి యుండియుండవలెను.దర్భ లోకదిక్కున వైచిన ప్రాణవాయువుయొక్క స్థితిని సూచించిన యెడల కర్ణేతర భాగములు సూచించునది ఆ కాంతియై యుండును. విద్యారణ్యునివంటి గొప్ప వ్యాఖ్యాతయే కర్మయొక్క భాగము లన్నిటినిగుఱించి యర్థమిచ్చుటకు పూనుకొనియుండలేదు. ఆత డచ్చటచ్చట నిచ్చిన కొన్ని దృష్టాంతముల యర్థములు యితర సాదృశ్యముల యర్థములను కనుగొనుటలో సహాయకారులు. కొన్నిభాగములు మాత్రమే యుదాహరణములనియు యితరములు కావనియు చెప్పుట యుచితముకాదు. సర్వమొకేవిధముగా నుండవలయును. ఇందువల్లనే విద్యారణ్యులు"విద్వాంస వేదగర్భోపాస్థి భాగవతా పర్యావిదః"(అరణ్యకము:883) అనుదానియొక్క యంతరార్థమును గ్రహిం

చినవాడే విద్వాంసుడని చెప్పియున్నాడు.

కర్మయొక్క అభిప్రాయము క్రైస్తవుల యర్థమైనను యిందున కనుగుణ్యముగానే యున్నది. రివరెండ్ డాలట్ వ్రాసిన కాంటప్రవర్షల్ కాటికిజమ్ 219 పేజీలో కర్మలయొక్క అభిప్రాయము మనమునందున్న గౌరవభావమును భక్తిని సజీవముగా జేయుటయు అజ్ఞానులకు మతతత్వమును సులభముగా బోధించుట యును నయియున్నవి. కాన నేను మహారాజా వారిని పండితసభ్యులను మతరహస్యములను మనమాచరించు కర్మయొక్క అంతర్భావమును బోధించవలయునని ప్రార్థించుచున్నాను. ఎందునకని ప్రశ్నించినయెడల మనము గ్రహించగలము. ఎందునకనుపదము తర్కఋషియొక్క వజ్రాయుధమైయున్నది. ఈ ఆయుధముయొక్క యుపయోగమును మన మిప్పుడు నిరసించు చున్నామనుట విచారకరము. మన మాచరించుకర్మనువిషయ విగర్హిణాలంకారమని చెప్పవచ్చును. అనగాయొకవిధమైన యుదాహరణము. ఈయుపమానభావము నుతొలగించినయెడల విశేషార్థమును మనముగ్రహించగలము.

కర్మయొక్క అంతర్భావమును గ్రహింపక నాచరించినయెడల సత్యమునెన్నటికి గ్రహింపజాలము. కర్మాచరణము ప్రాపంచిక సంబంధమును కొంత వృద్ధిజెందింప వచ్చును. కాని విశేషార్థసహితము కానియెడల స్వర్గప్రవేశమునకు నర్హత నియ్యదు. అందువలననే ఛాందోగ్యోపనిషత్తునందు "యదేవ విద్యాయాకరతి శ్రిద్ధయోపనిషదత దేవవీర్య

వ_త్తరమ్భవతి" అని దృఢముగా జెప్పుచున్నది. ఉపనిషద అన గా "ఉపనిషద బ్రహ్మజ్ఞాన యోగేన యుక్తశ్చకరోతి కర్మ" అని అర్థము జెప్పబడి యున్నది. (రామానుజవ్యాఖ్య 5) దీనినే మాక్సుముల్లరు (Sacred Books of the East Vol. 1 Introge) లో "మనుజుడు జ్ఞానముతోడను, నమ్మికతోడను, ఉపనిషత్తులతోడను అనగా దానియొక్క అంతరార్థమును గ్రహించి యజ్ఞమును చేసినయెడల యెక్కువ ఫలము కలుగును". అని భాషాంతరీకరించి యున్నాడు.

మనము విశేషార్థములను గ్రహించుటకు ప్రయత్నించవలసియున్నదని చెప్పియుంటిని. కనుక నిప్పుడు వేదముబోధించునటువంటి ఏకదేవతారాధనను గురించి కొంత నుడివెదను. వేదము బహుదేవతారాధనము బోధించునదియని కొందరు అసత్యవాదములు చేయుచున్నారు. Indian Reform Vol. 17 page 11 మీద వ్రాసిన యొకపత్రికయందు "మాక్సుముల్లరు వేదముయొక్క మతము బహుదేవతారాధనమనియు, ఏకదేవతారాధన కాదనియు చెప్పియున్నాడు. కొందరు జ్ఞానవంతులైన హిందువులు దేవతలందరును గలసి యొక్కడేయని జెప్పుచున్నారు. ఇది యీ నమ్మికను గీతములను వ్రాసినటువంటి ఋషులయొక్క నమ్మికముగాదు. అని చదివియున్నాను. ఒకక్రైస్తవ గ్రంథకర్త యిట్లు వ్రాయుటకు సాహసింప గలిగెను. అతనిపే రాపత్రికయందు కానుపించదు. ఈగ్రంథకర్త

తన మతమునకు చెందిన యొకని యభిప్రాయములను ఆధార ముగ గొనియున్నాడు.

మాక్సు ముల్లరనిన నాకెక్కువ గౌరవభావము గలదు. కాని యెట్టిసందర్భమున నాతడిట్లు చెప్పియుండెనో మనము విచారింపవలెను. ఆతని వ్రాతయొక్క యథార్థమును గ్రహింప వలెనన్న నాగ్రంథమంతయు పూర్తిగ జదువవలసి యున్నది. ఇట్టి సందిగ్ధ సమయములందొక వాక్యమందలి యర్ధభాగమునే గైకొనుటవలన యపార్థము గలుచున్నది. మన క్రైస్తవ స్నేహి తుడు మాక్సుముల్లరు జెప్పినదానిలో సగమును మాత్రమే గైకొని భారతీయులు వేదము ఋషులభావమునగాక వేరువిధ మైన యర్థమును జెప్పుచున్నారని నిందించుటకన్న నామాక్సు ముల్లరు చెప్పినదానిని పూర్తిగ గైకొనిన సమంజసముగ నుండి యుండును. మాక్సుముల్లరు వ్రాసినదానిని నిష్పక్షపాతబుద్ధితో నామూలాగ్రముగ చదివినయెడల వేదము యేకదేవతారాధ నము బోధించునది, బహుదేవతారాధన బోధించునది తెలియు గలదు. మాక్సుముల్లరీవిధముగ వ్రాసియున్నాడు.

"న్యాయముగా వానిని గహింపవలయునని బహు దేవతారాధన విషయమై మనకు గలిగిన మన వివేచనాబుద్ధికి ప్రతికూలములైన భావములను వదలి వేయవలసియున్నది." అనంతరము "పారిభాషిక శబ్దములతో మాట్లాడిన యెడల వేదముయొక్క మతము బహుదేవతారాధనమేగాని ఏకదేవ తారాధనముగాదని చెప్పవలసియున్నది." అని చెప్పియున్నాడు.

మన క్రైస్తవ మిత్రుడు యీవాక్యము యొక్క మొదటి భాగ మును విడచి యున్నాడు.

అతడెంత జాగ్రత్తపడి యున్నాడో యాలోచింపుడు. ఆతడు వేదమునందలి దేవతను వర్ణించుచు "బహుదేవతా రాధన మన సామాన్యముగా యిట్టి యర్థముగాదు. కాని ఏక దేవతారాధనమని చెప్పుటకూడా తప్పయినదే. దానికొక పేరు బెట్టవలయునన్న, కాతినతీజమ్, అని పిలచెదను." అని వ్రాసి యున్నాడు. (Chips from a German Workshop Vol. I Page 27-28) కనుక మాక్సుముల్లరు తానే అది బహుదేవ తారాధనముకాదని జెప్పియుండగా మనక్రైస్తవ మిత్రుడు. బహు దేవతారాధనమని చెప్ప సాహసించుట శుద్ధతప్పు. క్రీ. 1877 (ఉపన్యాసమిచ్చిన కాలములో) మాక్సుముల్లరు ఇది ఏకదేవతారాధనమని యొప్పుకొనక పోవచ్చును. కాని అది యెట్టి సందర్భమున చెప్పియున్నదో తెలిసికొనవలసియున్నది. ప్రస్తుతమున నేనెట్టిస్థితియందుంటినో అప్పుడాతడును అట్టిస్థితి యందేయుండెను. నేను నాస్వారస్యమంతయు వేదములకొరకు వృధాపరుచుచున్నానని కొందరు మిత్రులు నాకు వ్రాసి యుండిరి. ఇచ్చటను పండిత సభ్యులలో కొందరును నాశక్తిని తప్పు మార్గమున వ్యయపరచు చున్నానేమోనని వారి యను మానము సూచించుచున్నది. ప్రస్తుతము నేనెట్లు తలంచు చుంటినో యట్లే మాక్సు ముల్లరు ను తన యుప న్యాస ప్రారంభమున చెప్పియుండెను. "వేదమనగా నేమియని

నన్ననేకసారు లడిగియుండిరి. నాలుగువేల వత్సరములకు పూర్వము మృగప్రాయులును, అనాగరికులును, అయినవారి కొరకు వ్రాయబడిన పొత్తములవలన మన మేమి నేర్చుకొనగలమని నే ననేకసారులడుగబడియుంటిని" అని అతడు చెప్పియుండెను. (Chips page 2) వేదమునిన వైరభావముతో జూచెను మనుజులలో పుట్టిపెరిగిన మాక్సుముల్లరు వేదమువిషయమై ఉన్నతభావములు కలిగియుండుట అత్యాశ్చర్యకరము. ఆతడు పవిత్రహృదయుడై యుండవలెను. బహుదేవతారాధన విషయమై జనసామాన్యభావములను విడచినపుడు అతడిప్పుడేమిజెప్పునో మీరేయాలోచించుకొనుడు. ఆతనికప్పుడది యొకసమస్యయైయుండును. దానినతడు బహుదేవతారాధనమనియైనను యేకదేవతారాధనమనియైనను నిర్ణయించలేకపోయెను. అందువలన నొక నూతనాఖ్యను సృజించి యావిషమస్థితినుండి తప్పించుకొనెను. ఆతని నవీనగ్రంథములలో వేదము ఏకదేవతారాధనమునకే మిగుల సమీపస్థమని వ్రాసెననుటకు నేను సందేహింపను. ఈవిషయము పై వ్రాసిన ద్వితీయభాగములో నిట్లు వ్రాసియుండెను:—మనపూర్వులితరదైవములను దయ్యములనియు, భూతములనియు తలంచుటతప్పు. హిందూదైవముల నట్లుతలంచి యాతప్పును మనముతిరిగి చేయకూడదు. వారిదేవతలు (Eoen ఇయాన్ లేక హెమీనా Hemena) కంటె యెక్కుడు భౌతికమైనవిగాభు. అని నటకుడులేని కృత్రిమాకారములు:—అనగా మానవనిర్మితముగాని సృష్టికర్త నిర్మి

తములుగావు. నామములుమాత్రమేగాని ఆకృతులుగావు. (79 పేజి)

అగ్ని, మిత్ర, మొదలగునవి నామమాత్రము లేయని చెప్పుట మాక్సుముల్లరున కాధారములేమి? వేదమే యిట్లు జెప్పుచున్నది. వైరూపఋషి సుపర్ణాం ఋగ్వేద అని జెప్పియున్నాడు. (10-114-5) మాక్సుముల్లరు దానినీప్రకారము భాషాంతరీకరించియున్నాడు. విజ్ఞానముగల కవులు సుందర స్వరూపుని యనేక రూపాంతరగతుడైనను వాక్యప్రయోగములచే రెక్కలు(సుపర్ణ)గలవానినిగా జేయుచున్నారు. ఈ విషయమై సాయనాచార్యులు వ్రాసినవ్యాఖ్యానము "అర్థచిప్రాః మేధావినః కుర్వతి"అని చెప్పుచున్నారు. భాష్యమునుబట్టి యిందుకుసరియైన యర్థమేమన జ్ఞానులగు ఋషులు ఆపవిత్రుని బహురూపాంతర్గతుడైనను వాక్యప్రయోగములచే చలించువానినిగాచేయుచున్నారు. కవులనేపదము క్రాంతప్రజ్ఞ అనుభావమును సూచించుటలేదు. ఈవాక్య మొకటిగానే యుండలేదు. హిరణ్యగర్భమను సుప్రసిద్ధ సూక్తముగలదు. మాక్సుముల్లరీ సూక్తమును గురించి యెంత ఘనముగా జెప్పియున్నాడో చూడుడు. "భగవంతునియొక్క నిరూపణతో నేకత్వము నిస్సందేహముగను దృఢముగను మన యార్యజాతులు సహజముగ నేక దేవతోపాసకులు కాదని చెప్పుటకు సందేహించునిట్లు వెలిబుచ్చినట్టి యింకొకగీతముమాత్రమున్నది.(History of Ancient Sanskrit Literature 568)సభికులలో కైస్త

వవిమర్శకు నామోదించువా రెవరైన యున్నయెడల యీ మహాపండితుడు క్రైస్తవుడైనను ప్రయోగించిన ఏక దేవతోపాసనయొక్క నిరూపణ అనుపదములను జాగ్రత్తగా గమనించవలయును. ఈ సూక్తకర్త హిరణ్యగర్భఋషి నెల్లప్పుడు జ్ఞాపకముంచదగినవాడు. ఈఋక్కులోని హిరణ్యదర్భ అను పదమును హిర్యగర్భనామమును పొరబడకూడదు. ఆసూక్త మిటులున్నది. "హిరణ్యగర్భ...హియువిషవిధేమ"

పైదానిని మాక్సుముల్లరిట్లు భాషాంతరీకరించి యున్నాడు.

"ప్రారంభమున సువర్ణమయ కాంతులకు కారణభూత ముత్పత్తియయ్యెను. సర్వమునకు నాతడొక్కడే ప్రభువు. భూమ్యాకాశముల నతడు స్థాపించెను. మనమే దేవుని నారాధింపవలసి యున్నది?

ప్రాణముల నొసగువాడెవడు? బలమునిచ్చువాడెవ్వడు ఎవని యాశీర్వాదములు దేవత లాసించుచుందురు? ఎవ్వని సామీప్యము నిత్యజీవనము? ఎవని సామీప్యము మరణము. మన మారాధించవలసిన దేవుడెవ్వడు?

ఎవడు తనశక్తిచే సజీవమును సచేతనమునైన ప్రపంచమునకెల్ల ప్రభువయ్యెను? మానవ, జంతు సంతానమునెల్ల నెవడుపరిపాలించును? ఏదేవుని మన మారాధింపవలసియున్నది?

హిమవత్ పర్వతములును, మహాసముద్రములును, నదులును, యెవ్వనిశక్తిసామర్థ్యముల జాటుచుండును? ఏదేవుని మన మారాధించవలయును?

ఎవనివలన ఆకసము కాంతివంతమును భూమి స్థిరస్వభావము కలవియయ్యెను? ఎవనివలన స్వర్గము స్థాపింపబడియెను? వాయువునందలి కాంతుల కెవ్వడు పరిణామము నిర్మించియుండెను? మన మారాధించవలసిన దేవుడెవ్వడై యున్నాడు ?

అచలములైన భూమ్యాకాశములు భయవినయంబులతో నెవ్వనికై చూచుచుండును? అరుణోదయ మెవ్వనిపై ప్రకాశించుచుండును? మన మారాధింపవలసిన దేవుడెవ్వడు?

జలపూరితములైన మేఘము లెచ్చటకరుగునో ఎచ్చట బీజంబుల నాటబడి సూర్యరశ్మి తగులునో యచ్చట మొలచును. ఎవ్వడొక్కడే దేవతలకందరకు జీవనమైయున్నాడు? మన మారాధించవలసిన దేవుడెవ్వడు?

బలములకెల్ల స్థానభూతంబైన మేఘములు సైత మెవ్వనికి లోబడియుండును? దేవతలకు దేవుడెవ్వడు? మన మారాధింపవలసిన దేవుడెవ్వడు ?

అతడు మనలను నశింపజేయకుండుగాత; భూమిని సృజించినవాడును, పవిత్రవంతమైనవాడును, స్వర్గమును సృజించినవాడును, దేదీప్యమానమైన కాంతిని మహాసాగరములను సృజించినవాడును, మన మారాధించవలసిన దేవుడెవ్వడు ?
(Chips from Germanshop vol 1 page 29)

ఈ భాగమును పదములలోను మంత్రిక్రమములోను కొంచెము మార్పుతో ప్రతివేదమునందును చూడనగును. (ఋగ్వేదము 10-121, తైత్తిరీయవేదము 4-1-8. మైత్రా)

యణి వేదము 2-7-15: కాటక వేదము 16-15 కపిస్థల వేదము 32-7 వాజసనేయము 13-4 అధర్వవేదము 4-2)

ఈ సందర్భమున (Ancient India) గ్రంథకర్తయైన దత్తు యిట్లు చెప్పియున్నాడు "ఋగ్వేదమింతకన్న నెక్కువ చెప్పియున్నది. అందాత్మసృష్టినుండి సృష్టికర్త నెట్లుజేరునో సూచింపబడియున్నది. ఋగ్వేదీయులైన మహర్షులు సృష్ట్యారాధనతో తృప్తిజెందక సూర్యుడు ఆకాశము, తుపాను, ఉరుము. మొదలగు సృష్ట్యాంశములన్నియు మనకగోచరంబైన యొకనిచేతలని తలంచుచుండెడివారు. ఈవేదముయొక్క అంత్యగీతములలోనే సత్యమువిషయమై దేవుని విషయమై యిట్టి యూహాలు పొడసూపును." (వాల్యూం 1 పేజి 50)

దత్తుయనిన నాకెంత గౌరవభావముండినను యీవిషయమున మాత్రమాతనితో నేనేకీభవించను. ఆతడు బహుశః యీగీతమును ఋగ్వేదమం దంత్య (౧౦ వ) మండలమందలి యితరగీతముల నాధారముగాగొని యుండవచ్చును. ఇట్టిగీతము లీవేదప్రారంభమున లేనియెడల నాతడట్లుచేయుట న్యాయమై యుండును. ఋగ్వేద ప్రథమమండలమం దింతకన్న ముఖ్యమైన మంత్రములుండ నతడు గమనింపకుండు టాశ్చర్యకరము ఇదియొక మారుమూల మంత్రముగాదు. యాస్కాచార్యులు సాయనాచార్యులు దయానందస్వామి మొదలగు వారందరును దీనిని గమనించియేయుండిరి. అది "యింద్రం మిత్రం వరుణ మగ్నిం ......యమం మాతరిశ్వానమాహుః"

(ఋగ్వేద 1-164-46) అయియున్నది. అనగా "వానినియింద్రా అనియు మిత్రాయనియు వరుణాయనియు అగ్నియనియు పిలచెదరు. ఇంతియేకాదు. ఆతడు దైవస్వరూపుడు. పవిత్రవంతుడు. గరుత్మాన్ అయియున్నాడు. ఆతడొకడైనను జ్ఞానులతనిననేక నామంబులతో బిలచుచుందురు. అగ్ని, యమ, మాతరిస్వాన్, అని బిలచెదరు." ఈ నామంబులన్నియు దైవమునకెట్లు చెందునో తెలియవలెనన్న సాయనాచార్య వ్యాఖ్యానమును యాస్కనిరుక్తమును చూడుడు. (7-18) యీమంత్రము దేవుడొక్కడేయని చెప్పుటచేతను మన మజ్ఞానముచే వివిధ దైవములను దలంచుచుండిన యీ నామంబులన్నియు నొక్కనివేయని చెప్పుటచేతను హిరణ్యగర్భసూక్తముకన్న నెక్కువ ముఖ్యమైనది. కాన నో పండిత సభ్యులారా! యేక దేవతారాధనము వేదమందలి మంత్రభాగములందేగాక ఆదిమధ్యమ భాగములందును యుపదేశింపబడియున్నదని మీరు గ్రహించియుందురు. హిరణ్యగర్భసూక్తము ఋగ్వేదములో నంత్యమండలమునందున్నను కొన్ని వేదములలో మధ్యభాగమునందే యుండియున్నది. గాన (pie paper) పైపేపరు "కొందరు హైందవులు దేవతలందరొక్కటియేయని చెప్పుచుండినను పూర్వఋషుల మతమదికా"దని చెప్పుట నిరాధారమైనది. హిందువు లనేక దేవతలున్నారని యెన్నడును తలంపలేదు. వివిధనామములుగల దేవుడొక్కడేయని వారుస్థిరముగ నమ్మియుండిరి. కొందర జ్ఞానులీ నామములన్నియు వేర్వేరుదేవతలకు చెందినవని విష

యము నిష్పక్షపాతులైన ప్రాక్పండితులచే ఖండింపబడి యున్నది. వేద మీవిధంబున ప్రాక్పండితులచేతను (Oriental scholras) ప్రస్తుత హిందూ విద్వాంసులచేతను మాత్రమే గ్రహింపబడుచున్నదా? లేక పూర్వపు హిందువులచేత నిట్టులే గ్రహింపబడియుండెనా? ఈ ముఖ్యమైన ప్రశ్నకు సత్యమని నిస్సంశయముగ నుత్తర మివ్వవచ్చును. సూర్యసిద్ధాంతమను పురాతనగ్రంథము మీరెల్లరెరిగినదే. గ్రంథకర్తనెఱుంగుము. ఈసిద్ధాన్తము సూర్యునినుండి వచ్చియుండుటచేతను అతనికికృతి సమర్పింపబడి యుండుటచేతను సూర్యుడే గ్రంథకర్తయని చెప్పుచున్నారు. లగడాచార్యు లీగ్రంథకర్తయని తలంపబడు చున్నది. ఈ విషయమై (ఆర్యభట్టయొక్క భాష్యకర్తయైన సూర్యదేవుని గ్రంథములో చూడసగును.)

నేనీ పురాతనగ్రంథమునుండి కొన్నిశ్లోకార్థముల చదివె దను. కాన శ్రీరాజావారును సభ్యులును వినవేడుచున్నాను.

11 ఓమాయా! అధ్యాత్మమను రహస్యవిద్యను చెప్ప బోవుచునాను. కాన శ్రద్ధతోవినుము;-నన్ను హృదయపూర్వ కముగ ప్రేమించువారి యొద్ద నేను దాపవలసిన విషయ మేమియునులేదు.

12 అందరిలో నుత్తమ పురుషుడు వాసుదేవుడని పిలు వబడుచున్నాడు. ఉత్తమఆత్మ (పురుషు) వాసుదేవుని స్వభావ ములో కొంత గైకొనినదగుటచే అగోచరమైనదియు గుణ రహితమైనదియు శాంతమైనదియు లోకమునకు ప్రాణము

వంటిదియు నాశనరహితమైనదియు అయియున్నది.

13 సంకర్షణ అనబడు సర్వవ్యాపియైన యీపురుషుడు సృష్టియందు బ్రవేశించి జలమును సృజించి దానికి తన తేజస్సు నొసంగెను.

14. ఇది అంధకారమావరించిన యొకబంగారు గ్రుడ్డు ఆయెను. ఈ గ్రుడ్డునందు నిత్యుడైన అనిరుద్ధుడు ప్రథమమున ప్రత్యక్షమయ్యెను.

15. సర్వశక్తియుతుడైన యీ అనిరుద్ధుడే వేదముల యందు హిరణ్యగర్భుడని పిలువబడుచున్నాడు. ఆత డాది దృశ్యుడౌటచే ఆదిత్యుడనియు ఉత్పత్తి హేతువుచే సూర్యు డనియు పిలువబడుచున్నాడు.

16. సూర్య, సవిత, అని పిలువబడు యీ అనిరుద్ధుడు అంధకారము నశింపజేయుటకుత్తమ ప్రకాశమైయున్నాడు. త్రివిధములైన చేతనములను సృజించిన యీతడు ప్రపంచ మును కాంతివంతముగ జేయుచున్నాడు.

17. స్వయంప్రకాశమానుడును అంధకార వినాశకుడు నయిన యీ అనిరుద్ధుడు మహాస్ అని పిలువబడుచున్నాడు.

22. చంద్రుడాతని మనస్సునుండియు దీప్తరాశియైన సూర్యుడు కన్నులనుండియు నుత్పత్తియైరి. (విల్ కిన్సన్ వ్రాసిన సూర్యసిద్ధాన్తముయొక్క భాషాంతరీకరణము 77-78 పేజీలు)

కనుకనే లగడాచార్యులు హిరణ్యగర్భ, ఇదిత్య, సూర్య, సవితాదినామములన్నియు దేవునికె చెందియున్నవని

నిస్సంశయముగా చెప్పియున్నాడు. 22-వ శ్లోకమున మనకు గోచరంబగు సూర్యుడు సూర్యదేవునినుండి యుత్పత్తియైనట్లు కనుబడుచున్నది. ఈ రెండుస్థానములందును సూర్య అనుశబ్దము చాలముఖ్యమైనది. వేదమునందు సూర్య అనుశబ్దమునకు రెండర్థములుకలవు. అది సూర్యునికిగాని దేవునికిగాని చెందవచ్చును. ఈ భేదము తెలియకుండుటయే వివాదమునకు కారణము. ఇది తెలియకుండుటచేతనే బహుదేవతారాధననేరము మోపబడియున్నది. వేదమునందు సూర్యులిరువురుగలరు. అందు సృష్టికర్తయొకడు. సృజింపబడినవాడొకడు. పూజింపబడువాడుసృష్టికర్తయైయున్నాడు. పూజించువాడు సృజింపబడినవాడై యున్నాడు. ఇంద్రునివిషయమును యీతీరుననేయున్నది. తైత్తిరీయసంహితయందు 4-వ కాండములో 1-వ ప్రపాఠక 6 అను వాకమునందు ప్రాపంచిక సంబంధమైన ఆదిత్యేంద్రాదులు దేవునిపూజించుచున్నటుల వ్రాయబడియున్నది. చిత్తియందు 11 అను వాకమున 6 పనసలో, యింద్రో రాజాః అనియున్నది. ఋగ్వేదము (7-27-3-1 చూడనగును)

ఇచ్చోట ఇంద్రా అనుపదము సృష్టికర్తయైన దేవునకు చెందియున్నది. అనగా పూజింపబడువానికి చెందియున్నది. ఈ పదమునకు విద్యారణ్యులు పరమైశ్వర్యయుక్తః అని అర్థము చెప్పియున్నాడు. శాస్త్రాచరణమునందు, పరదైవములనగా దేవతలు ప్రార్థింపబడుచున్నారు. కాని దేవుడు ప్రార్థింపబడుటలేదని మీలోకొందరు తలంపవచ్చును. ఇవి నిజముగాదని

వినయపూర్వకముగా జెప్పుచున్నాను. ఋగ్వేదమునకు సాయ నాచార్యులు వ్రాసిన భాష్యము ప్రథమపుటలో యీ సందేహము నివృత్తి జేసియున్నాడు

"యద్యపీంద్రాదయః.....పరమేశ్వర ఇవహూయతి"

అని చెప్పియున్నాడు. కర్మయందు తటస్థించు యింద్ర, అగ్ని మొదలగు పదములు దేవునికే చెందుచున్నవిగాని చిన్న చిన్న దేవతలకు చెందుచుండుటలేదు. ఈ యర్థము వ్రాయుటలో సాయనాచార్యులు నాయనపిమ్మట వచ్చిన సంఘసంస్కర్తలైన శంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యులు మొదలగువారేకీభవించి యున్నారు. పరమాత్మమాత్రమే సత్యమనియు మిగిలినదంతయు మిథ్యయని శంకరాచార్యుని మతమైయున్నది. అట్టివాడసత్యమును నిత్యమునైనటువంటి దేవతలను బోధించునా? రామానుజ మధ్వాచార్యులేయితర దేవతలు నారాధింప దగినవారు కాదని చెప్పియున్నారు. కాన పాశ్చాత్యభావము లంతరించి పాశ్చాత్యభావములు వ్యాపింపకముందు చాలకాలము పూర్వమున్నటువంటి లగడ, శంకర, రామానుజ, మధ్వాచార్యులు మొదలగువారే యేకదేవతారాధనమును గ్రహించి చాటియున్నారని శ్రీ రాజావారును సభ్యులును గ్రహించియుందురు. ఈ విషయము విరమించకముందు మనపూర్వులు వేదము నెంతసూక్ష్మబుద్ధితో భద్రపరచియుండిరో నివేదించెదను. న్యాయముగా విచారించిన హిరణ్యగర్భసూక్తమునందు తొమ్మిదిశ్లోకములు మా

త్రిమే గలవు. పదియవది పిమ్మట చేర్చబడియున్నది.

ఈ సందర్భమున సభాధ్యక్షులైన శ్రీమహారాజా వారి సహాయమున ప్రచురింపబడు ఋగ్వేదమునకు ప్రచురణకర్త వ్రాసినదానిని చదివెదను. చివరపదియవ శ్లోకమునంతరము చేర్చబడినది. ఇందుమూలమున రచననైపుణి చెడిపోయెను. ఈ గీతమంతటియొక్క భావమును చెడిపోయెను. ఇది పిమ్మట చేర్చబడినదనువిషయము మనవ్యాఖ్యాతలకే తెలిసియుండినటుల గోచరమగుచున్నది. కనుకనే పదవసూత్రమునందిది వ్రాయబడియుండలేదు."

ఋగ్వేదీయులు దీనిని హైతొమ్మిది ఋక్కులతోనుకలిపి చదివెదరు. కాని వారికిపదములేదు. మనపూర్వులచే నతిభద్రముగా దాపబడిన వేదము మనమతిజాగరూకతతో బరిపపలసియుండును.

వేదాభ్యాసము ఏకదేవతారాధన ముపదేశించుట మాత్రమేగాక ప్రస్తుతము మనయందున్న యితరవిషయములైనయజ్ఞానమును పారదోలుట కవసరమైయున్నది. ఇప్పుడు మనయందున్న దురాచారములను పిచ్చినమ్మకములను వేదాధ్యయనమువలన అంతరించును. ఎన్నికావ్యములు బఠించినను యెన్నిధర్మశాస్త్రములు జూచినను యెన్నిపురాణము లభ్యసించినను సత్యమును మనముగ్రహింపనేరము. ముక్తిమార్గమును గ్రహింపజాలము. స్వాధ్యాయ బ్రాహ్మణము "యదిగం శృణోతి అలకగంశృణోతి" అనిచెప్పియున్నది.(15ఖండ) వేదము

తప్పతదితరము లెవ్వివినినను అసత్యమునే వినుచున్నాడు. దీనికి విద్యారణ్యభాష్యమున "యదిం...శ్రవణేనన్యథా" అనియున్నది.

"వేదాధ్యయనము వదలి సభలయందు శాస్త్రముల నాకర్ణించువాడు అన్నృతమునే గ్రహించుచున్నాడు. ఏలనన శాస్త్రములు పురుషార్థములు బోధించుటలేదు" అని దీనియర్థము.

కావ్యములు మొదలగునవి నైనను పురుషార్థమును బోధింపజాలవు. శృతియందు "నహిప్రవేదా సుకృతస్యపంధా" అనియున్నది. ఇందుకు భాష్యము "పుణ్యానుష్ఠానమార్గం నజానాతి తస్మాత్ కంఠశోష మాత్ర్వ పర్యవసానం" అయియున్నది. ముక్తిమార్గము గ్రహింపలేడని దీనియర్థము. ఇందు మూలమున వేదాధారము లేనిదే శాస్త్ర పురాణములను చదువుటవలన సత్యమును గ్రహింప జాలమని స్పష్టమగుచున్నది. వేదమునందలి యుపమానము పురాణమునందు కల్పితకధనై యున్నది. ఋగ్వేదమునందలి ఉపమాలంకారములును, రూపకాలంకారములును, బ్రాహ్మణములందు చరిత్రగాను, పురాణములందు విచిత్రములైన కల్పితకధలుగాను తీసికొనబడుచున్నవని దత్తుచెప్పియున్నాడు. (వాల్యుం ౧ పేజి 280)

మన మిపుడొక యుదాహరణము దీసికొనియెదము. రామాయణకావ్యమునందు అహల్యయొక్క కథకలదు. ఇంద్రస్తు......తపసశ్చమహాత్మనః" (1-48-29) మహాభారతము

నందు మరియొక కథయున్నది. "తతోగచ్ఛేత బ్రహ్మర్షేర్గౌతమస్యవనం ప్రియః అహల్యా యాహ్రి దేన్నాత్వా ప్రజేతపర మాంగిరం" (3-84) హరివంశమునందు "దివోదాసశ్చ రాజర్షిః రహల్యస్యగస్స్విసీ శరద్వ తశ్చదాయాదమహల్యా సముసుగత శతానందం ఋషిశ్రేష్ఠమ్ తపస్యాపి సుమహా యునః" (32-౧-20 శ్లోకము)

విష్ణుపురాణమున "రామోపిబాల దర్శనమాత్రేనా హాల్యా మపపంచకర" (4-4-41)

ఈ కథ కావ్యమునందుండుటచే దీని యుత్పత్తి కారణ మేమో యీకల్పిత కథకు రూపకాలంకార మేదియొ కనుగొనవలసి యున్నది. ఇందుకు శ్రుతి మనకు తోడ్పడును. తైత్తిరీయారణ్యకమున (1-12-4) "సుబ్రహ్మణ్యోగం" మొదలగునవి యున్నవి. నేను శోధించినంత వరకిది సామవేదమునకు చెంది బ్రాహ్మణము లెనిమిదింటిలో షడ్వింశ బ్రాహ్మణమునను శుక్ల యజుర్వేదముయొక్క శతపథ బ్రాహ్మణమునను కానవగును. ఇది ముఖ్యవిషయమగుటచే అందున్న దాని చదివెదరు. సామవేదబ్రాహ్మణమున "అథ సుబ్రహ్మణ్యా మాహ్వాయతి......గౌతమబ్రువాణేతి" అని యున్నది.

వాజసనేయ బ్రాహ్మణమున "ఇంద్రాగచ్ఛేతి... .. ప్రిరిమ్మదయిషతి" (3-3-18) ఇ దేసంహితయందైన కానగునాయని యనేకులాలోచించియుండిరి. సామ శ్రోత్రి

సూత్ర గ్రంథకర్తయైన లాత్యాయనుడు "అగ్నిష్టుత్సవాగు ఏయనిగడః" అనిచెప్పి సందియము నివృత్తిచేయుచున్నాడు. (1-4-1)

అతడు దానిని నిగడయని పేర్కొనియున్నాడు. నిగడ యనగా నేమి? ఈపదము సామాన్యభాషలో నరుదుగాన యర్థము నెరిగించెద. అమరసింహుడు దానికి పూర్ణార్థ మిచ్చియుండలేదు. అతడు నిగడను నిగాడః అనిచెప్పియున్నాడు. ఈ శబ్దార్థము నిగడ=అనగా స్పష్టముగా నుచ్చరించినది. వేదభాషయందు దీనికొక గూఢార్థముగలదు. వేదమంత్రములు ఋగ్యజుస్సామములని త్రివిధములుగా విభజింపబడినట్లు నేనిదివరకే చెప్పియున్నాను. నిగడః అనబడు వేరొక విధమైన మంత్రములు కలవు. ఇవి యేసంహితయందును కానబడవు. "ఆచార్యులొప్పుకొనిన పిమ్మట బౌద్ధులిట్టి వ్రాతనాధారముగా గాని యొక సందిగ్ధవాదమును కల్పించియున్నారు. ఈనిగడలు వైదికసంబంధములో కానివో గ్రహించుట దుర్లభము. వైదికసంబంధమైనవని తలంచిన యెడ యేవేదమునకు సంబంధించినవో నిర్ధారణ చేయవలసియున్నది. వైదికసంబంధము కావనినయెడ తదనుగుణ్యముగ నాచరించు యజ్ఞములన్నియు వైదికములు కానేరవు. (పద్ధర్మచింతానిక 1 వాల్యూం 337 పేజి.) విరోధులు "నిగడావా చతుర్థంస్యాత్ ధర్మవిశేషాత్" అని తర్కించుచున్నారు. (పూర్వ మీమాంస 2-1-38)

జైమిని "యసుజూంపివతదూ్రిపత్వాత్" అనిజెప్పి దీనిని ఖండించియున్నాడు.(2-1-40)నిగడలు వచనరూపములైనమంత్రములనియు వల్లింపబడు నవియనియు వేసంహితయందుకానబడనివియనియు బ్రాహ్మణములందు సూత్రములందు నున్నవనియుసంహితమంత్రముల కాధారములనియు సారాంశము తేలుచున్నది. మధుసూదనేడు "నిగడ అగ్నిదగ్ని న్నిహరేత్యాది సంబోధనా రూపనిగడమంత్రః అపేయజురాంతర్భూతియేవ" అని వివరించియున్నాడు. (Indis+che studien 1-14) శబరాచార్యాను సారము నిగడయనగా, ని=ఎలుగెత్తి,గడ=అపాదబోధోగద్యః అని యర్థము. ఎలుగెత్తి చదివిన గద్యయని యర్థము. (పూర్వమీమాంస 2-1-45) గనుకసుబ్రహ్మణ్యాసూత్రము గద్యయని తేలుచున్నది. ఇది యేసంహితయందును కానబడదుగాని మూడు బ్రాహ్మణములందు మాత్రమున్నది. కర్మాచరణమునందిది బ్రహ్మశ్రీ యనబడు నొకగీతమువలె సంపాత్ స్వరయుక్తముగా నుచ్చరించబడుచున్నది. ఈఋషి ఆదిత్యుడని చెప్పబడుచున్నాడు. ఇచ్చటాదిత్యుడనగా నొక మనుజుడై యుండవలెనుగాని దేవుడుగాడు. ఇతడు సృష్టికర్తయైనయింద్రుడైయున్నాడు. కాని సృజింపబడినవాడుకాడు. ఇదివరలో సూచింపబడినట్లుపదేవతలు పూజార్హులుగారు. ఋగ్వేదప్రారంభమునను కర్మకాండాదిని యింతకుముందు సూచింపబడినట్లు శంకరాచార్యులు "పరమేశ్వర ఏవహూయతే" అని చెప్పియున్నాడు. అనగా ప్రార్థింపబడువాడు దేవుడని

యర్థము గాన నిచ్చోట ప్రార్థింపబడు యింద్రుడు పరమేశ్వ రుడై యుండవలెను.

ఇప్పుడు సుబ్రహ్మణ్యా నిగడయొక్క అర్థమును గ్రహించ ప్రయత్నించెదము. ప్రథమమున దానియర్థము ననుసరించివిభజింపవలసియున్నది. అరణ్యకమునం దర్థములో సంబాధములేకయే కొన్నిపదముల ననుసరించి విభజింపబడి యున్నది. నిగడయొక్కస్వరమున "సుబ్రహ్మణ్యాయాం స్వరితస్యతూదాత్తః" అని పాణిని స్థిరపరచియున్నాడు. (1-2-39) ఇందుమీద నాధారపడి పతంజలి మహాభాష్యమును కాశికవృత్తియు యీ మంత్రమును స్వరయుక్తముగానిట్లు విభజించియున్నారు:— "సుబ్రహ్మణ్యోం...కౌశిక బ్రాహ్మణ గౌతమబ్రువన" గురుతులేని యక్షరములు ఉదాత్తములు.

ఈనిగడయొక్క అర్థమునుచెప్పక పూర్వము పూర్వమీమాంసయందుజైమినిచే చెప్పబడినసూత్రములను మనము నందుంచవలెను. "స్రుతిలింగవాక్య, ప్రకరణ ... విప్రకరాత్" (1-1-14)

ఈసూత్రముయొక్క దుష్ప్రయోగము కన్ని యొక్క వాక్యములకంటె బాగుగా వర్ణించనేరము. "సమాఖ్యయను నిదర్శనపద్ధతిని ప్రయోగించుటలో మానసికదూర సంబంధ మధికముగ చేరియుండును గాన నీ దర్శనపద్ధతి యన్నిటికంటె నీరసమైనది. దాని ప్రయోగము విధిలేనప్పుడు దప్ప వదలి వేయవలయును. ఇతర పద్ధతులన్నియు బనివడనప్పుడొక వాక్యమున కర్థము జెప్పుటలో దాని విషయమై యాచార్యు డొక డేమిచెప్పెనో చూడవలయును. ఈదినములలో మూల గ్రంథములు చదివి గ్రహించుట యరుదు. అధునిక వ్యాఖ్యాన ములు వాటిని మూలకంపినవి. ఈ రీతిగా నిండియాదేశము ప్రస్తుతము హైన్యదశకు పునాదియగు వీరి పూర్వపు బుద్ధి కుశలత లేదనుచున్నారు. పలనన శాస్త్రములు నిబంధనలు సామాన్యజనులయొక్క జీవితములును చక్కగా ఋజుమార్గ మున నుంచుచుండెడివి. మరియు సత్ప్రవర్తనయుదానియొక్క గుణవిశేషములను బాగుగా బోధజేసెడివి. ఇప్పుడు తల్లక్రిం దైనవి. ఇచ్చట పండితులు సామాన్యజనుల పరిస్థితుల కను కూలముగా శాస్త్రముల కర్థము జెప్పుచు వారి దురభ్యాసము లకును చెడురుచుల కనుకూలించునట్లు చేయుచున్నారు. మన

ప్రజలయొక్క యిట్టి మార్గము మాన్పుటకే సూత్రమే దివ్యాపథము, ఏలనన గొప్ప మతబోధకుడగు జైమిని యీ దిగువ నిబంధనను మిగులావశ్యకముగా నేర్పరచియున్నాడు. చివరకు శ్రుతివాక్యముల కర్థము జెప్పనప్పుడైనను ద్రాష్టాంత పద్ధతులలో శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, క్రమసమాఖ్యలు వాటి వాటియొక్క బలిమి ప్రాముఖ్యము క్రిమముగా యోచించిన మీదట ప్రయోగింపబడవలయును. గ్రాంథిక సంబంధము లేక దూరస్థమగు మానసిక సంబంధము సాధ్యమైనంతవరకు త్యజించవలయును.

ఈ సూత్రమునం దంత్యపదమైన సుబ్రహ్మణ్య అను పదము సామాన్యముగా నొక వర్గదేవతయని యర్థము చెప్పబడుచున్నది. వేదార్థమనికాదు. విద్యారణ్యులు "శోభనం బ్రహ్మసుబ్రహ్మ వేదః తస్మై హితః సుబ్రహ్మణ్య యింద్రః" అని చెప్పియున్నాడు. సు+బ్రహ్మ+వేదః అని యర్థము. దానికి హితుడైనవాడు సుబ్రహ్మణ్యుడు. అనగా దేవుడు. తదుపరి పదము సంబోధనార్థమునందు ప్రయోగింపబడియున్నది. "ఓ దేవుడా!" యిది ముమ్మా రుచ్చరింపబడి

యున్నది. షడ్వింశ బ్రాహ్మణ వ్యాఖ్యానమందు విద్యారణ్యులు "త్రీణిమనోవాక్కాయకర్మణి" అని చెప్పియున్నాడు. పిమ్మట పదము ఇంద్రాద్యైయున్నది. విద్యారణ్యానుసారమిది "పరమేశ్వరయుక్త" అని యర్థమిచ్చును. కాని నిది సృష్టికర్తమైన పరమేశ్వరుడని యర్థమిచ్చునుకాని సృజింపబడిన దేవతయని అర్థమివ్వదు. హారివాయనునది తరువాతి సంబోధన. సామవేద బ్రాహ్మణమున దీనికి హారివా అగచ్ఛేతి పూర్వపక్షాపరపక్షౌవా యింద్రస్య హరితాభ్యాం హేదం సర్వంహరతి" అని యర్థము చెప్పబడియున్నది. హరతియనగా విద్యారణ్యుడు "సర్వంజగత్ హరతి కాలాత్మకేన నియచ్ఛతీతి" అని యర్థమిచ్చియున్నాడు. అనగా దివారాత్రముల చేయువాడు "మేధాతిథర్మేష" తదుపరి పదమైయున్నది. ఇది చాలముఖ్యమైనది మేషఅనునది "మేధాతిథే" అనుదానికి కలుపబడవలయును గాని "వృషణస్వస్య" అనుదానికి పూర్వముంచకూడదు. ఈపదమునకు "మేధాతిథిః" అను ఋషికి స్వర్గమిచ్చినవాడనియర్థము. ఋగ్వేదసంహిత (10-2-40)

విషయమున కనంతరపదము "వృషణస్వస్యమేనె" అయియున్నది. వృషణఋషియొక్క పుత్రికయగు మేనకచే పూజింపబడినవాడు. ఇందుమూలమున స్త్రీపురుషభేదము లేక యోగ్యులైన ప్రతివారిని దేవుడు గైకొనునని స్పష్టమగుచున్నది. ఈ అభేదము నిరూపించుటకై పురుషులలో మేధాతిథిని స్త్రీలలో మేనకను ఈసూత్రము పేర్కొనియున్నది. పర్యాయపదము "గౌరవాస్కందిన్" అయియున్నది. గౌరాకారము దాల్చినవాడు. "అహల్యాయైజార" అనునది పిమ్మట పదము. దీనికి చాల అపార్థములు కల్పింపబడుచున్నవి. కొందరు గౌతముని భార్యయైన అహల్యయొక్క విటుడని చెప్పుచున్నారు. వేయి వత్సరములకు పూర్వమునుండినవాడును శంకరాచార్యులకు పూర్వుడునైన కుమారిలభట్టను మీమాంసకాచార్యుడు ఉషా, అహల్యలయొక్క చరిత్రలు కల్పితకథలని నిరూపించియున్నాడు. అతడు సృష్టికి ప్రభువైన ప్రజాపతి. సూర్యునియొక్క మరియొక నామమనియు, సృష్టినంతను రక్షించువాడగుట నట్లు పిలువబడుచున్నాడనియు కల్పింపబడియున్నది. అతని కుమారిక ఉష. అరుణోదయము, సూర్యుడరుణోదయము వెనుక నుదయించుటజేసి అతడామెను ప్రేమించినట్లు చెప్పుచున్నారు, సూర్యుని రాకకు పూర్వమామె లేచుటచే ఆమె యతని పుత్రికయనియు చెప్పబడుచున్నది. ఈవిధముననే యింద్రుడహల్యయొక్క విటుడని చెప్పబడియున్నాడు." అని జెప్పియున్నాడు. "ప్రజాపతిస్తా

వత్ ... నపరస్త్రీవ్యభిచారాత్" (మూర్ముల్లరు A S. L 529) యిందు రిండట్టి పాపమాచరించినట్లు చెప్పియుండలేదు. ఇంద్రుడనగా సూర్యుడు అహల్య అనగా రాత్రి. అంధకారరము సూర్యోదయమున నాశనమగుటచే యింద్రు డహల్యా విటుడైనట్లు చెప్పబడుచున్నది. కొందరు విద్యారణ్యుడు జెప్పినయర్థము పురాణభావముతో నేకీభవించి యున్నదని చెప్పవచ్చును. కాన కుమారిలభట్టు యెంత గొప్పవాడైనను ఆతని యర్థమును మనము గ్రహింపవలదు. అట్లైనచో నేను విశేషించి చెప్పనవసరముండదు. ఐనను కుమారిలుని వాదము న్యాయమైనదియు హేతుభూతమైనదియు నైయున్నది. జార అనగా నర్థమేమి? అమరకోశమున నుపపతి యనియు విటుడనియు నర్థమున్నది. అమరము లౌకికనిఘంటువు, విద్యారణ్యుడు "వైదికపద పదార్థా లౌకికాభ్యాం భిన్నౌ"అని చెప్పియున్నట్లు ఇదివరకే సూచించియున్నాను.(22)

షడంగములలో .నొకటియైన యాస్క నిరుక్తములో కొంతభాగము వేదమున కకారాదినిఘంటువై యున్నది. జార అనుపదమునకు అమరమందుగాక యాస్కనిరుక్తమున చూడవలసియున్నది. అందుజార అనుపదమునకు "నాశక"అనియర్థమొకసారిగాక మువ్మారు చెప్పియున్నాడు. (3-16-5-24-10 21) శబ్దకల్పద్రుమమున 532 పుటలో "జారయతి, నాశయతి" అనియున్నది. జౄ+నిక్+అచ్ హరాతాయధా(ఋగ్వేద 1-66-4) తారానాథ వాచస్పతి 3115 పుటలో "జర్యతే

నేన బ్రూజరవేఘా'' అని చెప్పియున్నాడు. శబ్దార్థానుసారమై నను వేదమందైనను "జార" అనగా నాశకర్తయని యర్థము. దేనికినాశకర్త? అంధకారతుల్యమైన పాపమునకు, శిలాసమమైన దురితమునకు. యీ అంధకారమే అహల్య. అహల్య అనగా ననేకార్థములుగలవు.ఆపెయొక్క అప్సరస.గౌతముని భార్య. అహల్య అనగా పుణ్యక్షేత్రము లేక హ్రదము అనియు కూడా నర్థముకలదు. (మహాభారతమున చూడనగును). ఈ పదమునకు పతివ్రతయనియు నర్థముకలదు. ఇచ్చట అహల్య యనగా కీకాంధకారమని యర్థము. దయానందస్వామి "అహ దివము, అహలీయతే అహల్య''అని చెప్పియున్నాడు. సూర్యుడంధకారమును పారదోలునటుల నింద్రుడు లేక పరమేశ్వరుడు పాపమును పోగొట్టుచున్నాడు. పాషాణ సమపాపినియైన అహల్యను పాదస్పర్శచే అనగా కటాక్షముచేత పవిత్రమైన దానినిగా నొనరించునటులనే యింద్రుడు (దేవుడు) అజ్ఞానమును పారదోలి జ్ఞానము నొసంగుచున్నాడని చెప్పుటకు విద్యారణ్యుడు రామాయణకథను సూచించియున్నాడు. వేదనిరుక్తమును కుమారిలభట్టును చెప్పిన యర్థముల నిరసించి విద్యారణ్యస్వామి క్రొత్తయర్థముల నిచ్చువాడుకాడు. యజ్ఞమునందు పురుష అనగా పరమేశ్వర 'ఏవ' అనియు నిగడసూత్రమునందు యింద్ర అనగా పరమేశ్వరయుక్త అనియు నర్థమిచ్చిన యీ మహావిద్వాంసుడు పవిత్రుడైన దేవుడు జారుడని చెప్పెననుట అసందర్భము. ఆతలంపు మాత్రమునే దేహముకంపిం

చును. ఉపదేవతయైన సృజితేంద్రుడట్టి పాపము నాచరించునని చెప్పవచ్చునేమోకాని సృష్టికర్తయైనవా డట్లుచేయునని ఆర్యు డెవ్వడు ననజాలడు. ఇచ్చట సృష్టికర్త పేర్కొనబడినాడు గాని సృజింపబడినవాడుగాడు. పైన జెప్పిన రామాయణము నందే దేవతయైన యింద్రుడు క్రతుశత మొనరించినట్లు చెప్ప బడియున్నది. ఆతడీ మంత్రమునే యుపయోగించి యుండవల యును. ఆతడు తననే ప్రార్థించుకొని యుండడుకదా. "నేన హల్యతో జారత్వము చేసినవాడ"నని యాతడు తననే ప్రార్థించి యుండెననుటకంటె హాస్యము వేరొండుకలదా? ఆతడుగాని మరియెవ్వరైనను మఖమొనరించునపుడు దేవుని మాత్రమే ప్రార్థింపవలయును. కాన "అహల్యాయై జార"అను వాక్యమునకు మనమతము నావరించియున్న అంధకారమును పారద్రోలువాడనియే అర్థముకాని వేరుకాదు. సభ్యులారా! మన ప్రార్థన లందెన్నడైన నపవిత్రమైన భావముల యోచింప గలమని నిరూపింపగలరా? మహాత్ముడైన శంకరాచార్యులు- జెప్పినట్లు ప్రార్థన సత్సంగత్వముకొరకై యున్నది. మనము పవిత్ర విషయముల నాలోచింపుచు పవిత్రవంతులతో సహ వాసము జేయుచు పరిశుద్ధవస్తువులతో కూడియుండవలెను. అపవిత్రమైన పదము నొక్కదాని నుపయోగించిన యెడల ప్రార్థనా ఫలితమంతయు నశించుచున్నది. ఆర్యుల రక్తము నానాళములందు ప్రవహించుచున్నంత కాలము తపమందు గాని ప్రార్థనయందుగాని వారపవిత్రత కందు పాలొనంగి

రనుట సహింపజాలను. మనరాజ ప్రతినిధుల (గవర్నరు) లో నొకరు "నేను శాస్త్రములయొక్కయు వేదములయొక్కయు భాషాంతరీకరణంబుల జదివి అవి యెట్టి పవిత్రమైన నీతిని బోధించునో గ్రహించితిని" అని చెప్పియున్నాడు, (హిందూ పత్రిక 15 అగష్టు 1887.)

కుమారభట్టాచార్యుని వాదమునకు ప్రతివాదముగా నీ నిగడయందు జెప్పబడిన యింద్రుడు ఉపదేవతయేగాని పరమేశ్వరుడు కాడని చెప్ప సాహసించువారున్నయెడ నేను వాదమునకు సిద్ధముగా నున్నాడను. తదుపరి రెండుపదముల విషయమై విస్తరించి చెప్పవలసిన బనిలేదు. ఈవిషయమై వాద ప్రతివాదముల సరిగా నాలోచించిచూడుడు. సందర్భమును గ్రహించుడు. జనసామాన్యమును సంతోషింపజేయునటుల వేదమున కర్థము జెప్పవలదని షడ్దర్శనచింతామణి గ్రంథకర్త యిచ్చిన యభిప్రాయమును మరువకుడు. జైమిని చెప్పిన సూత్రము ననుసరింపుడు. సనాతనపండితులు వేదవాక్యంబుల జెప్పిన యర్థముల మరువకుడు. ఇంతటితోనైనను తృప్తిజెందనియెడల అహల్యాయై జారా అనుపదమునకు కారణసహితమును పవిత్రమునైన యర్థముజెప్పిన ప్రాచీనపండితుడైన కుమారిలునితోడను, నవీనపండితుడైన దయానందస్వామితోడను వీరిద్దరి యర్థముల నామోదించిన ప్రస్తుతపు దత్తుగారితోడను తర్కమొనర్పుడు.

ఉపన్యాసము విరమించకపూర్వము యజ్ఞము మున్నై

నది ప్రార్థనముం దైనది యొక్కింత చెప్పెదను. మానవుడు ప్రథమమున యజ్ఞమును ప్రారంభించి కాలక్రమమున వదలివైచెనని కొందరు చెప్పవచ్చును. అట్లు చెప్పుటకు పూర్వమొక్కింత యోచింపుడు. ఈ విషయమై మీరనుకొనునట్లొకటిగాక రెండు వాదములున్నవని మాక్సుముల్లరు చెప్పుచున్నాడు. “ప్రతిమతమును యజ్ఞముతోడను, యజ్ఞసూత్రములతోడను ప్రారంభించెనని సామాన్యాధారములపై నమ్మువా రీవిధమైన గీతములను నిగడలను పురాతన మతచిహ్నములని నమ్మెదరు. కాని ప్రార్థనమును స్తోత్రమును వందనార్పితమును భక్తియు ప్రారంభములను నమ్మువారు యీనిగడలనే నవీనకల్పితములని నమ్మెదరు. ఈసమస్య సామాన్య ప్రమాణంబుల నాధారంబుగగాని వాదించుటకు వీలుకలుగదు. యూదులు యజ్ఞముతో ప్రారంభించి కీర్తనలతో సమాప్తిం జేసియుండుట వలన ఆర్యులట్లే యొనరించియుండిరని చెప్పుట సమంజసము గాదు. కాలక్రమానుసార మమర్చబడిన చీనాదేశపు భాషయైనను హిందూదేశీయుల ఆత్మాభివృద్ధిని సూచింపజాలదు. ఒక దేశముయొక్క పూర్వవాఙ్మయ చరిత్రమును కనుగొనవలయునన్న యేదేశమున కాదేశమే వేరువేరుగా చూడవలయును. కానియొకరితో పోల్చకూడదు. యజ్ఞముముందా ప్రార్థనముందా యనుప్రశ్న విత్తుముందా చెట్టుముందా యను ప్రశ్నవలె నంతులేనిదై యున్నది అని అతడు చెప్పియున్నాడు.

Chips from a German workshop Vol. I page 12

మాత్సు మల్లరుయొక్క భావమును మనస్మృతియును ఆమోదించుచున్నది. మాండూక్యోపనిషత్తున "మం. తేషు కర్మాణి .........బహుధాసంతతాని" అని యున్నది. (1-2-1) కాన ఆర్యమతమునందు ప్రార్థన ప్రథమమైనదనియు యజ్ఞము మనుజులకు మానవుని యంతరస్వభావమును తెలుపుటకై పిమ్మట ప్రారంభింపబడినదనియు నిస్సంశయముగా జెప్పచున్నాను.

ఇప్పటికే మిగుల కాలాతీతమైనది. ఇదివరలో చెప్పినదాని పర్యవసానము విశదపరచి ముగించెదను. విద్యావంతుడును రాడ్వంశ సంభూతులునైన మన సభాధ్యక్షు లనేక సారులు చెప్పియున్నటుల వృథావాక్యములతో కాలయాపన మొనర్చను. సభాధ్యక్షులైన రాజావారి న్యాయాధికారునిగాను నిష్పక్షపాతులైన సహాయన్యాయమూర్తులు Assessers గాను యెన్నుకొని న్యాయసభ నొకటి స్థాపింపవలయునని నేను కోరుచున్నాను. పైపేపరు (Pie Paper) ను దాని నామోదించువారును వాదులుగ నుండవలెను. వేదము ప్రతివాదిగ నుండును. కించిజ్ఞుడనైన నేను వేదపక్షమున న్యాయవాదిగా నుండెదను.

యీక్రిందివి సారాంశములై యుండును:—

1 వేదమును (సంహిత) అర్థయుతముగ పఠించుట అగత్యమా?

2 వేదము దేవుడొక్కడే యనియు దేవతలు కారవ

నీయులనియు చెప్పుచున్నదా లేక బహు దేవతారాధనమును బోధించుచున్నదా?

3 యజ్ఞమునకు అంతర్భావమును విశేషార్థము నున్నవా లేవా?

4 మనము కర్మ నొనరించునపు డద్దాని సంకేతికార్థ మును గ్రహించవలసి యుండునా లేదా?

5 సుబ్రహ్మణ్యా నిగడయందున్న అహల్యాయైజారా అను పదమునకు అంధకార నాశకుడని యర్థమౌనా కాదా?

పంచాయితీసభ నెన్నుకొనెదరు గనుక తీర్మానము లకు పునర్విచారణ యుండదు. కాన జాగ్రతగా నాలోచించి స్థిరపరచుకొనుడు. మొదటిదాని విషయమై ఋషులందరును వేదపఠనము చేయవలసినదని చెప్పిరనుటకన్న నెక్కువ జెప్ప నవసరములేదు. స్వాధ్యాయ బ్రాహ్మణమున "తస్మాత్స్వ యోజ్యైతవ్యో......తస్యసాయుజ్యం గచ్ఛతి" అని యున్నది. (పేజీ 47) శతపథశ్రుతి "యజ్వద్ధవా అగంచందసః...... ఘృతగ్ హసామాన్యమృతం యజుగ్ంపి." అని చెప్పుచున్నది. (867 పేజి) వేద మర్థసహితముగా చదువవలసిన దనుటకు ఋగ్వేదమునందలి వాక్యమును దానికి సాయనాచార్యుని భాష్యమును ప్రమాణములైయున్నవి. "ఉతత్వం సఖ్యేస్థిరప్ ఈతమా హుర్నైనం......అఫలామ పుష్ప" (ఋగ్వేదము 10-21-5) భాష్యము "అనంత ముత్తరార్ధేన కేవల...... పాఠం ప్రబువానశ్చ రతీత్యర్థః" అని యున్నది.

రెండవ సందర్భమున లగడ, శంకర, రామానుజ, మధ్వాఖ్యాచార్యులును యింద్ర, హిరణ్యగర్భాది సూక్తము లును యీ సారాంశమునే తెల్పుచున్నవని చెప్పుటకన్న నెక్కువ చెప్ప నక్కరలేదు. ఈవిషయమై నిష్పక్షపాతియైన కోల్ బ్రూక్ వేదమందెందరు ప్రార్థనలు సలిపి యున్నారో అందరు దేవతలున్నట్లు కనుబడుచున్నది. కాని పురాతన వ్యాఖ్యానములందీనామములన్నియు త్రిమూర్తులకు చెందు చున్నవనియు నీ ముగ్గురును గలసి యొక్కడేయనియు చెప్పు చున్నవి. ఈ నామములన్నియు నొక్క దేవునికే చెందు చున్నవని వేదమునందనేక భాగములందు చెప్పబడియున్నది. ఋగ్వేద విషయసూచిక ప్రథమమున నిరుక్తముయొక్కయు యీ వేదముయొక్కయు ప్రమాణములతో నిది స్పష్టముగ విశదీకరింపబడినది. యస్యవాక్యం సఋషిః ......తదపి ఏతద్ ఋషిం ఉక్తం ఇంద్రం మిత్రం వరుణం అగ్నిం ఆహురితి అనుక్రమణిక యందలి యీ వాక్యము కొంత నిరుక్తము (c 12) నుండియు వేదబ్రాహ్మణమునుండియు గైకొని సంక్షే పింపబడినది. ఇందుమూలమున సనాతన హైందవమతము దేవుడొక్కడేయని చెప్పుచున్నట్లు తేలుచున్నది. అని నుడివి యున్నాడు. 1వాల్యూం 27 పేజి).

మూడు నాలుగు విషయములలో నేను కర్మనాచరింప కూడదని చెప్పుచున్నానను భావము మీమనములనుండి తొల గింపుడు. మానవుడు కొన్నికర్మలు తప్పక నాచరింపవలసి

యున్నది. మరికొన్ని వానియిష్టమైనయెడల నాచరింపవచ్చును. ఏదేశమువారును కర్మాచరణముకూడదనరు. ఏకర్మలాచరింపదగినవి ఏకర్మలాచరింపదగనివి, అను ప్రశ్నమనకిపుడనవసరము. కర్మయొక్క నంతర్భావమెరిగి మనమాచరింపవలసినదని నేను నొక్కివక్కాణించుచున్నాను. ఛాందోగ్యోపనిషత్సూత్రమును ప్రమాణముగగొని చెప్పియుంటిని గనుక కర్మకంతరార్థము కలదను విషయము నెవరును సంశయింపరని దలంచెదను. కనుక తదాచరణ ఫలముచెందుట మనము గ్రహించవలసియున్నది. ఉపనిషత్తులు మాత్రమే విశేషార్థమును బోధించుచున్నవనియు మిగిలిన వేదమంతయు కర్మార్థమును బోధించుచున్నవని చెప్పుట న్యాయముకాదు. అటు లనుటవలన ఉపనిషత్తులు వేదభాష్యములని చెప్పవలసి వచ్చునని శంకర రామానుజులు చెప్పియున్నారు. ఉపనిషత్తులు వేదాంతములై యున్నవి. వానికొరకే వేదములు సృజింపబడినవి. మంత్రముల భావమునే ఉపనిషత్తులు విపులముగ బోధించుచున్నవి. అట్లు కానియెడల నీ వాదమునకు మీమాంసక ఉపక్రమ ఉపసంహారాది సూత్రములకును భేదము కలుగును. ఇందు మూలముననే బాదరాయణుడు "మంత్ర వర్ణేక మేవచ గేయతే" అని చెప్పియున్నాడు. ఉపనిషత్తులయందు చెప్పబడినదే మంత్రములయందు కీర్తన చేయబడుచున్నది. సాయనాచార్యులు ఋగ్వేద భాష్యమునందు ఉపనిషత్తు మాత్రమేగాక వేదముయొక్క యితరభాగములును బ్రహ్మ

మునే బోధించుచున్నవని చెప్పియున్నాడు. దీనివిషయమాత్రము వ్రాసినది తప్పక చదువవలసియున్నది. మైత్రాయినీ యుపనిషత్తున చెప్పబడినరీతి కర్మయొక్కభావము దైవారాధన బోధించుటయే అయి యున్నది. అందు "బ్రహ్మయజ్ఞవయే షాయత్పురుషంచయున" అనియున్నది (1-1) ఉపనిషత్తులను భాషాంతరీకరించిన కౌవెల్ యమ్.ఏ., గారు "పైకర్మాచరణ మంతయు పరమాత్మ నారాధించుటకు మార్గమైయున్నదని దీనిభావము"ని చెప్పియున్నాడు. (234 పేజీ ఫుట్ నోటు) కాన కర్మను అంతరార్థ విశేషార్థముల గ్రహించి యాచరించి పూర్ణ ఫలితమును చెందవలసియున్నదిగాని మర్యాదకొరకు కాచరింపవలసినదికాదు.

అయిదవవిషయము సుబ్రహ్మణ్య నిగడచేత ఆహ్వానింపబడిన యింద్రదేవునికి అపవిత్రతనారోపించుట పాపకార్యము. అచ్చట చీకటిని పోగొట్టువాడుగా చెప్పబడియున్నది. మరియు రామాయణమున పాపరాశిని పవిత్రముగా తనస్పర్శచేత జేసినట్లు చెప్పబడియున్నది. వేదములో చెప్పబడిన యింద్రుడే రామాయణములోని రాముడని దత్తుయూహించినది సమంజసమనితోచుచున్నది. ఎందుచేత "యింద్రపాత్రముపః వాయసీతాంసమేత్రపూప...కర్మాణి కర్మాణిస్వాహా" (పారాశర గృహ్యసూత్రము 2-17-9) వేదములోని యింద్రుడు పరమేశ్వరుడని యిదివరకే చూపబడియున్నది. వేదములో నత డంధకారమును బాపువాడని చెప్పబడియున్నది. "దర్శనమాత్రేణ

అహల్యాం అపాపంచకార” విష్ణుపురాణము అని వర్ణింపబడి యున్నది. అతని జారుడని ఆహ్వానించుట మిక్కిలి హేయము. విదేశీయులచేతకూడా మనపూర్వుల కారోపింపబడిన ఉత్కృష్టమగు శీలమును నిరసించడమౌను. విజయనగరం శ్రీ ఆనంద గజపతిరాజా మహారాజావారును వారి జనులందరు వేదమును చక్కగా నభ్యసించి అర్థము గ్రహించి ఆర్యులు భగవంతుని యెడను మనుజులయెడను చేయవలసిన విధులనొనరించి యీ లోకమున ఔన్నత్యమునుబొంది పరలోకమున నిరవధికసుఖమును పొందుదురు గాత.

ఓమ్





**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B103 |
| పుస్తకం పేరు | వేదమతము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 131 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |